# ప్రబుద్ధాంధ్ర

సచిత్రమాసపత్రిక




విడిసంచిక రెండు అణాలు ౬ ౧౧ సంపాదకుడు

సంవత్సర చందా రూపాయి నవంబరు ౧౯౩౫



శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# విరాళములు

సంవత్సరచందాలవల్ల మాత్రమే ప్రబుద్ధాంధ్రను నిర్వహించడం చాలా కష్టంగా వుంది. ఈసంగతి గమనించి, ఆంధ్రజాతీయవికాసంకోసం ఉత్కంఠులై వున్న ఔదార్యవంతులు ఉత్సాహపరిమితాలైన విరాళాలు దయచేస్తూ మాకు చాలా ఆసరా అవుతున్నారు. అలాంటివారింకా యెందరో వున్నారు. వారి సాయానికెదురు చూస్తున్నాము.

ఈనెలలో ప్రబుద్ధాంధ్రను సత్కరించినవారు:—

౧. స్థానం నరసింహారావుగారు, తెనాలి
మొదటి వాయిదా ౧౦-౦-౦

౨. కే. వేంకటాద్రిగారు,
మునిసిపల్ కమిషనరు, తిరుపతి ౫-౦-౦

---

# అభ్రకభస్మము

ఇది శరీరదార్ఢ్యము, వీర్యవృద్ధి, బుద్ధిసూక్ష్మత కలిగించును. క్షయ, ప్రమేహములు హరించును. మధుమేహమునకు ప్రత్యేకౌషధము. నిశ్శక్తి, తాపము తగ్గించును. అనుపానభేదములతో అనేకరోగములకు వాడవచ్చును. తులము ౨-౦-౦

# లోహభస్మము

రక్తవృద్ధి, బలము, తేజస్సు కలిగించును. ఉబ్బు, (నంజు) పాండువు, తిమ్మిరులు, శూల, అజీర్ణము, గుల్మవ్యాధులు తగ్గించును. అనుపానభేదములతో అనేకరోగములమీద వాడవచ్చును తు, ౮

గంధర్వఫార్మసీ, ఇన్నీసుపేట, రాజమండ్రి.

---

# చరకసంహిత

చికిత్సాస్థానము మాచే ఇదివరకు ఆంధ్రీకరింపబడి యిపుడు ద్వితీయ ముద్రణమగుచున్నది. మిగిలిన ఆరు స్థానములను ఆంధ్రీకరించి, స్థానషట్కమనే పేరుతో ఒకే పుస్తకరూపమున ప్రచురించితిమి. గ్రంధములన్నియు కొలదిదినముల క్రిందటనే ఖర్చైనవి. వెంటనే ఆర్డరిచ్చువారికి తగినసౌకర్యముగా లభింపగలవు. చరకసంహితనంతను నేనే పూర్తిగా ఆంధ్రీకరించుచుండి మిగిలిన సూత్రస్థానమునుకూడ ఆంధ్రీకరించి త్వరలోనే ప్రచురింపబోవుచున్నాడను. గ్రంథము పూర్తిగాకుండగా ఆర్డరిచ్చువారికి తగుసౌకర్యములతో లభింపగలదని అందరికి తెలిసిన విషయమే. మా యితరపుస్తకములును, మా 250 రకముల మందులును ఎల్లప్పుడును సిద్ధముగా నుండును.

డాక్టరు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, బెజవాడ.

# ఆధునికాంధ్రవాఙ్మయం—తరవాయి

### నరహరిశెట్టి వెంకటరత్నంగారివి

ఆంధ్రహృదయము ౦ ౬ ౦

### మంగిపూడి వేంకటశర్మగారివి

మట్టుకత ౦ ౬ ౦
నిరుద్ధభారతము ౦ ౪ ౦
బాలవితంతువిలాపము ౦ ౪ ౦
భీష్ముని చరిత్ర ౦ ౧౨ ౦
సాధుసంజీవనము ౦ ౬ ౦
కోయిలపాటలు ౦ ౪ ౦
వీరమతి నాటకం ౦ ౧౨ ౦
సహకారవిజయం ౦ ౧౨ ౦

### కర్లపాలెం కృష్ణారావుగారివి

వివేకానంద నాటకము ౦ ౧౨ ౦
మల్లెపూలు ౦ ౧౨ ౦
వ్యాసమంజరి ౦ ౧౨ ౦
ఆంధ్రదేశము మొదటిభాగం (యూనివర్సిటీ పోటీకి వెళ్లిన నవల) ౦ ౧౨ ౦
ఆంధ్రదేశము మొదటిభాగం (యూనివర్సిటీ పోటీకి వెళ్లిన నవల) ౦ ౧౨ ౦

### పెనుమర్తి వేంకటరత్నంగారివి

రత్నాపణము (ఖండకావ్యాలు) ౦ ౬ ౦

### త్రిపురనేని రామస్వామిచౌదరిగారివి

సూతపురాణము ద్వితీయాశ్వాసము ౧ ౦ ౦
సూతపురాణము ద్వితీయాశ్వాసము ౧ ౦ ౦
సూతపురాణము చతుర్థాశ్వాసము ౧ ౦ ౦
కురుక్షేత్ర సంగ్రామము ౧ ౦ ౦
శంబుకవధ (ఉత్తరరామచరిత్ర) ౦ ౧౨ ౦
కుప్పుసామిశతకము ౦ ౨ ౦
వివాహవిధి ౦ ౧ ౦

### ఆండ్ర శేషగిరిరావుగారివి

కేయూరబాహు చరిత్రము (వచనము) ౦ ౬ ౦

### బొడ్డు బాపిరాజుగారివి

శశికళ (ఖండకావ్య సంపుటి) ౦ ౮ ౦

### త్రివేణీ వర్ధనీ గ్రంథమాలవారివి

మధుకలశి (ఉమర్ ఖయ్యాం) ౦ ౧౨ ౦
[illegible] (నాటకము) ౧ ౦ ౦
పాంచాలీపరిణయము (నాటకము) ౧ ౦ ౦

### తేకుమళ్ల అచ్యుతరావుగారివి

విజయనగరసామ్రాజ్యమందలి
ఆంధ్రవాఙ్మయచరిత్రము ౨ ౦ ౦

### విశ్వసాహిత్యమాలవారివి

లియో టాల్‌స్టాయి ౦ ౩ ౦

కళాభివర్ధనీ పరిషత్తు రాజమండ్రి

# ఆధునికాంధ్రవాఙ్మయం—తరవాయి

**నాళం కృష్ణారావుగారివి** రూ. అ.

తేనెచినుకులు ౦ ౮
పాలతరగలు ౦ ౮
గోగీతము ౦ ౨
పైడితడి ౦ ౨
ముద్దు ౦ ౪

**పూజాపుష్పమాలవారివి**

వాకిలు ౦ ౮
కావ్యబిందువు ౦ ౮

**రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారివి**

వ్యాససంగ్రహం ౨ ౮
గద్యచింతామణి ౧ ౮
బాలకవిశరణ్యము ౧ ౮
వ్యాసావళి ౧ ౦
ఆంధ్రకవిభిషక్కుల భాషాభేషజము ౧ ౦

**వ్యాసకుటీరంవారివి**

జన్మభూమి నాటిక ౦ ౪
ప్రేమాంజలి–పంచముదంపతుల చరిత్రం ౫
శుభోదయము ౦ ౩
శ్రీ వివేకానంద సందేశము ౦ ౨
కుసుమాకరము ౦ ౧౪
తూలిక ౦ ౧౦
ఆత్మజ్యోతి ౦ ౮
సంధ్య ౦ ౬

**ఉన్నవ లక్ష్మీనారాయణగారివి**

మాలపల్లి ౩ ౦
నాయకురాలు ౧ ౦
సంగీతనాపసాని ౦ ౧
బోది ౦ ౧
భావతరంగాలు ౦ ౧
హరిజన నాటకము ౦ ౧

**వఝ్ఝల వేంకటేశ్వరకవిగారివి**

శాకాభంగము ౦ ౧౨

**గోల్కొండ పత్రికవారివి**

గోల్కొండకవుల సంచిక ౨ ౦
ఉచ్ఛల విషాదము ౦ ౧౨
కవికులవిర్ణయచంద్రిక ౧ ౪
సంఘోద్ధరణము ౦ ౬
కర్నూలు రాజవంశావళి ౦ ౨
రఘునాథ్ ౦ ౧ ౬

**మాకేమండ రామారావుగారివి**

భారతీయ విద్యాచరిత్రము ౦ ౧౨
శ్రీమధ్వాచార్యులవారి చరిత్ర ౧ ౦

**భావరాజు వేంకటకృష్ణారావుగారివి**

విదేశయాత్రికులు–ప్రాచీనాంధ్రదేశము ౧ ౪
ప్రాచీనాంధ్రనౌకాజీవనచారిత్రం ౧ ౦

**కవితాసమితివారివి**

వైశాఖ—వార్షిక సంచిక ౧ ౦
ఊర్వశి–అపతనము నాటకం ౦ ౧౨
ప్రభవ—ఖండకావ్యాలు ౦ ౮
మాతృపూజ పద్యఖండాలు ౦ ౪

**స్థానాపతి రుక్మిణమ్మగారివి**

పూలమాల—ఖండకావ్యాలు ౦ ౪

**ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారివి**

వ్యాసావళి ౦ ౪
తెనుగు వీణ, పాటలు–పద్యాలు ౦ ౨

**కూచి నరసింహాంగారివి**

ఆత్మసంయమము–అమితవిషయాసక్తి ౦ ౬
అనుబంధము ౦ ౩

**నడింపల్లి వేంకటహనుమంతరావుగారివి**

సాహసిక—నవల ౧ ౦

**మహాదేవ సూర్యప్రకాశరావుగారివి**

మునిమాపు ౦ ౧౨
వకుళమాల ౦ ౧౨

**డా॥. స్వర్ణవల్లిగారివి**

వినోదశిల్పము ౧ ౪

**ఆంధ్రరత్నగ్రంథమాలవారివి**

సుందరి ౧ ౦

**మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రిగారివి**

చతుర్దశమనుచరిత్ర ౦ ౮
సుభాషితములు ౦ ౧

**పార్నంది రామశాస్త్రిగారివి**

శ్రీమహాభారత విమర్శ ౦ ౮

**రాయసం శేషగిరిరావుగారివి**

కోతమారాజా (నాటకం) ౦ ౧౨

**రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారివి**

నాటకోపన్యాసములు ౦ ౧౨

**సాహితీ సమితివారివి**

సఖ. మొదటిసంపుటం. నాలుగు సంచికలు. కాలికోబయిండు. ౨ ౧౨

**డా॥. శతకోపాచార్యులుగారివి**

జగత్కథ (వెల్సు వరల్డు హిస్టరీ) ౨ ౦
శాకాశివిశము ౦ ౧౦

**ముసలికంటి సంజీవరావుగారివి**

బక్సారుయుద్ధము చరిత్ర ౦ ౧౨
ఔరంగజేబు పాదుషా ౦ ౧౨
సిందుబాదుకథలు ౦ ౫

**మునిమాణిక్యం నరసింహారావుగారివి**

కాంతం కథలు ౧ ౦
నేనూ మా కాంతం ౦ ౪
వక్రరేఖ ౧ ౦
ఉపాధ్యాయుడు ౦ ౬

**రెం. లక్ష్మీనరసింహాంగారివి**

హృదయవిహంగము ౦ ౪

**నడింపల్లి జగన్నాథరావుగారివి**

ఆంధ్రమహాసామ్రాజ్యము (సాదా) ౧ ౪
క్యాలికో ఉత్తమప్రతి ౨ ౮
Age of Mahabharata 1 0

**చెలికాని సత్యనారాయణగారివి**

జడగంటలు ౦ ౬
రహస్యరేఖ ౦ ౬
చక్రపాణి ౦ ౬

**గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారివి**

వోటు ౦ ౧౦
మూర్ఖరాజా ౦ ౪
నీతిధర్మము ౦ ౪
సంపూర్ణస్వరాజ్యము ౦ ౪
శ్రీరామచరిత్ర ౧ ౬
ప్రపంచచరిత్ర (గ్రీసు)
౧ నుండి ౨ భాగాలు
భాగం ౧౨ ౦ ౬
నాలుగవ భాగము దొరుకుటలేదు
Neglected Emperorpoet 0 8
Spiritual Swadesi 1 0
Age of Vemana 0 6

**మార్కండేయభవనం వారివి**

సచ్చిదానందం (యూనివర్సిటీ పోటీకి వ్రాసిన నవల) ౧ ౦
కథాకావ్యము (పద్యాలు) ౦ ౧౨
కథాకావ్యము (వచనం) ౦ ౧౨

**కొంపటి సత్యనారాయణగారివి**

అశ్వరు సార్వభౌముడు ౦ ౮

వలయువారు. కలాభివర్ధనీ పరిషత్తు. కలబరగి వారి యింట్లో, ఇన్నీసుపేట రాజమండ్రి అని వ్రాసికోవాలి.

## ఆ నిరాశాభావము — ఆ శిథిలజీవనము

ఆమెకు యేండ్లు యెన్నో లేవు, ఆమె యీ విశాల ప్రపంచములో హాయిననుభవిస్తు గృహానికి దీపమై కలకలలాడుతూ వుండాలి.

కాని ఆమె దృక్కులో నిరాశాభావము శాశ్వతావాస మేర్పరచుకొన్నది. తానొక శిథిలజీవినని ఆమె అనుకొంటూవున్నది.

సౌందర్యము, సౌఖ్యము గజ్జెకట్టుకొని గంతులు వేయవలసిన యీ లేతవయసులో యింతటి నిరాశయా? స్త్రీ జీవితము యీవిధముగా చిదికిపోవుటకు ఆమెకుగల ఋతుసంబంధమైన దోషములే కారణము. కిలకిలలాడించు కడుపునొప్పి, క్రమముతప్పిన బహిష్టు — యివే స్త్రీ సౌఖ్యజీవితానికి అంతరాయములు.

ఈ అంతరాయములను తొలగజేసి శాశ్వతముగ స్త్రీల నారోగ్యవంతులుగ జేయగల ఔషధరాజము లోధ్ర. లోధ్ర సేవనము వేలకొలది స్త్రీలకు ఆనందారోగ్యములను ప్రసాదించినది. మీరెందుకీ రహస్యమును తెలిసికొనరు.

గర్భాశయ రోగనివారణి
**లోధ్ర**

---

**Sparkling & refreshing beverage** — **Stimulating & invigorating Tonic**

*Always drink*

# VIMTO

**The best nature's fruit tonic drink that keeps you fit and cheerful throughout the Year.**

*Sole bottlers for Vigaz. Dt:—*

## THE CRYSTAL AERATED WATERS,

**manufacturers of high-class mineral waters and Aerated water specialists,**

VIZAGAPATAM




సంపుటము ౬ రాజమహేంద్రవరము ౧౦ నవంబరు ౧౯౩౫ ౧౧ వ సంచిక

# మళ్లీ అయిదు కొట్టేదాకా............?

సుబ్రహ్మణ్యశాస్త్రి—సంపాదకుడు

“ఇదిగో....................ఇదిగో”

“....................”

“ఏమండోయ్ !”

“....................”

“......ఇలా చూడండీ”

“....................”

“......మెలుకువ రాలేదూ ?”

“....................”

“......మిమ్మల్నే నండీ”

“ఊ.........”

“లేవరూ ?”

“....................”

“......ఇంకో మాటు చూడండీ”

“....................”

“మీగుట్టు మీపెదిమలు బైటపెడుతున్నాయి లెండి......వోస్”

“....................”

“ఏంనవ్వుకుంటా రండీ లోపల్లోపలా ?”

“....................”

“......వులిక్కిపడ్డారా పాపం ?”

“ఏమిటీ అంటున్నావూ ?”

“తెల్లవారింది”

“వెలుగు—”

“పొద్దే పొడిచిం దండీ”

“అబ్బా! ఎంత బండనిద్దర పడుతోందీ యీామధ్యా!”

“రాత్రిళ్లు చాలా శ్రమపడుతున్నారు కాదూ మరీ?”

“వొప్పుకున్నావా ?”

“......మీరంత కష్టపడి నాటకం రాస్తూవుంటే—”

“రాస్తూవుంటే ?”

“పదకొండుగంటలదాకా కవిత్వం చేస్తూ కూచుంటున్నారు కనక—రాత్రంతా సరిగా నిద్రలేక—తెల్లవారగట్ల చల్లగాలికి గాఢనిద్ర పట్టిపోతోంది”

“అయితే ?”

“అంచేత మెలుకువ రావడం లేదు”

“రాకపోతే ?”

“పెందలాడే లేవలేకపోతున్నారు”

“లేవలేకపోతే ?”

“నడే. నేను లేపాను”

“నువ్వెంతసే పయిందీ లేచీ ?”

"..........."

"అప్పుడే నీళ్లు పోసుకోడమూ, ముస్తాబు కావ..."

"ఇప్పుడే అయింది. పొద్దెక్కిపోవడంవల్ల మిమ్మల్ని లేపుదా మని—"

"నువ్వు లేచినప్పుడే యెందుకు లేపావు కాదూ ?"

"తెల్లవారుజాములో నేనా కాస్త సుఖంగాని నిద్ర పోకపోతే మీకు జబ్బుచెయ్యదూ ?"

"నీకో ?"

"నాకేం ? మీరు ఆఫీసుకి వెళ్ళాక పన్నెండు గంటల దాకా నేను పడుకుంటూనే వున్నాను కాదూ ?"

"అలా చెప్పుమరి !......అయినా నువ్వు చీకటి వుండగానే లేవడమూ, నేను పొద్దుపొడిచీదాకా పడు కోవడమూ—ఈ యెగుడుదిగుడు లేమీ బాగా లేవు రుక్కూ"

"ఇంచక్క వున్నాయి"

"అయితే నాకేం ?"

"నాకు మాత్రం యేం ?"

"...................."

"...................."

"మరి లేవనియ్యి"

"...................."

"మంచం దిగిపోరుకున్నావేం ?"

"ఏం ?"

"లేవనియ్యి"

"బాగానే వుంది......"

"చేతులందిస్తే యేమవుతుంది ?"

"ఉ—వ్—వ"

"ఏంచెప్పువచ్చాట అన్నానూ ?"

"ఏమనేనా వింటే ?"

"పోనీ మాట్లాడను లే......"

"నాచేతకాదు బాబూ"

"అసలే చెడింది"

"ఏంగునుస్తారండీ ?"

"...................."

"మళ్ళీ పడుకుంటే—పోనీ నాకేం ? ముఖం కడుక్కోడానికి పెట్టిన నీళ్ళు చల్లారిపోతాయి. నీళ్లుపొయ్యి ఆరిపోతుంది"

"కొంగంచు తెగనవతోస్తే సరి"

"డికాక్షన్ చల్లారిపోతే ?"

"ఇంకా......మెల్లిగా......"

"కాఫీ సంగతి చెవినిపడితేనే మీకెంత చురుకు వచ్చింది, అది కంఠంలో పడితే—"

"పంజాబ్ మెయిల్"

"బాహోయ్ !"

"తొందరగా పద"

"చన్నీళ్లు పోడనా"

"చన్నీళ్ళు కాచావా నువ్వూ ?"

"తొరపడాలి కండీ"

"అంతేకదా ?......ఇంత ప్రేమతోటీ లేపి, చివరికి చన్నీళ్ళలో మునగ మంటావేమో బాబూ—"

"పా—పం"

౨

"పంచదార చాలదు"

"..................ఏం ?"

"......ఎక్కువయింది. కసింత డికాక్షన్ పొయ్యి"

".........చూసుకోండి"

"...................."

"చాలా ?"

"మొగటికే వచ్చింది. ఇంకేం చూడనూ ?"

"ఈమాటు పాలు చాలాయి కాదు...కదూ ?"

"హా—హా—హా"

"బాగుంది యుక్తి"

"కనిపెట్టేశావ్ !......ఏదీ ? అరకప్పైనా వుందా నీకూ ?"

"నాకిదే యెక్కువ"

"ఛా........."

"చాల్చాల్చాలు......అంతా నాకే యిచ్చేస్తారా యేమిటండీ ?"

"ఈమాటు పుచ్చుకుందాం...మరి కానియ్యవేం?"

"పుచ్చుకోడానికి అసలు మీకు గుక్కెడేనా లేందే"

"ఇందాకా నీకో?"

"...................."

"...................."

"కోపం వచ్చిందా?"

"రాదా యేమిటి నువ్వు చేసిన పనికి?"

".........ఏం?"

"గడ్డం పట్టుకున్నప్పుడు......ఇక యిద్దరికీ సమానంగా పంపు మరి"

".........ఏం?"

"నాకెక్కువ యిచ్చావు"

".........సరిగా లేదూ?"

"ఇంకాస్త తీసుకో"

"చూడండి"

"...................."

"ఇంకాస్త"

"...................."

"ఇంకో రెండుచుక్కలు"

"...................."

"వొక్కచుక్క"

"గ్లాసు పట్టుకురానా?"

"అరచుక్కా......ఆ! సరిపోయింది. ఇక పుచ్చుకో......"

"మీతో సరిగా వాటా పెట్టాలా నాకూ?"

"కష్టపడి తయారుచేసినందుకు నీకే యెక్కువ వుండాలి న్యాయానికి"

"మరి వొక్కచుక్కా — అరచుక్కా — అంటూ తూచినట్టు పంచారేం?"

"వోడిపోయాను......"

"దురుసుతనం యెప్పుడూ పనికిరాదునుమండీ"

"...................."

"తప్పుమాట అన్నానా?"

"...................."

"మళ్లీ కోపం వచ్చిందా?"

"...................."

"ఏంచేస్తే పోతుందో చెప్పండి మీ కోపం?"

"నావాటా నీవాటా కలిపి—"

"నోటికి పోతుందా?"

"పానశాలరాయుడు లాగ—"

"మహాబాగా జ్ఞాపకం చేశారండి. మంగళగిరి వెడదామా వోమాటు?"

"ముందీ సంగతి తేల్చు"

"అయితే వొకటి చెప్తా వినండి"

"ఏమిటది?"

"ఎల్లుండి మీరు విశాఖపట్నం వెడతారు కాదూ!"

"వెడితే?"

"అప్పుడు నావాటా, మీవాటా కూడా నేనే పుచ్చుకుంటాను లెండి"

"అక్కడ నేను మరో కప్పు యెక్కువ పుచ్చుకుంటానేమో?"

"నేను చూడవచ్చానా యేమిటి?"

"నేనుమాత్రం చూడవచ్చానా యేమిటి?"

"...................."

"మాట్లాడవేం?"

"......కాఫీ చల్లారిపోతోంది చూశారా?"

"అదిగదీ! చివరికి అలా తీసుకురావాలి పాయింటు దగ్గిరికి......మరి కానియ్యి......"

"...................."

"...................."

"ఏమండీ! మంగళగిరి మాట చెప్పరూ?"

"......వెళ్లాలని వుందా?"

"ఎన్నాళ్లనుంచో వుందండీ. ఒక్కమాటు వెడదాం. మళ్లీ నాలుగురోజుల్లోనే తిరిగివద్దాం. ఏం? పాతిక రూపాయలే కాదూ జీతం నష్టం?"

"......పైగా ఖర్చులో?"

"మూడోక్లాసులో వెడదాం......"

"...................."

"ఏం, నవ్వుతారేం?"

"అది మాత్రం వూరికే వస్తుందా ?"

"ఏదయినా చోట అయి దయితే చాలు. అది లాభం కాదూ ?"

"......ఒక్క మరతుకి ఒప్పుకుంటావా ?"

"......ఏమి టదీ ?"

"......మనం......దేవుడికి సమర్పించడం...... పానకం కాదు"

"మరేమిటీ ?......"

"..................."

"......కాఫీ యిద్దామా ?"

"..................."

"మీభక్తికి తప్పకుండా మెచ్చుకుంటాడు"

3

"ఒక్కమాటు గదిలోకి వస్తారండీ"

"ఎందుకూ ?"

"..................."

"రహస్యమా ?"

"..................."

"అంత తొందరా ?"

అప్పుడే ఆలస్యం లోనే చేరిపోయింది"

"అయితే అడగడ మెందుకూ ?"

"..................."

"ఉండువుండు. కుర్చీ వెనక్కి జరుపుకోనియ్యి"

"మీరు లేవనక్కరలేదండీ"

"రాణీగారికి ప్రత్యుత్థానం—"

"అబ్బ!"

"ఇదిగో సింహాసనం. దయచెయ్యాలి !"

"............నా కేం ?"

"అదేమిటి ?"

"ఊ అంటె అయిపోయిందానికి ఆలస్యం చేసుకుంటున్నారు మీరు"

"తగిన ఫలం వుండకపోదులే"

"..................."

"ఊ... ..ఏమిటి తరవాయి ?"

"మీకు కాఫీ సరిపోయిందా ?"

"..................."

"తృప్తి అయిందా ?"

"ఆమాటెందుకూ యివ్వడూ ?"

"చెబుదురూ !"

"ఇప్పటిదాకా జ్ఞాపకమా ?"

"పులకం !"

"..................."

"ఉండండి.........చెప్పరూ ?"

"జ్ఞాపకం చేసుకోనియ్యి"

"..................."

"మనస్సు చెదిరిపోతోంది"

"...ఇంకా...పోతోందా...మెల్లిగానూ ?"

"హాయ్......హాయ్ ! ......పొరపాటు. ......ఏదీ ?......"

"..........వుండండీ"

"......నువ్వో......వుండరాదూ ?"

"......చూశా......రా ?"

"..................."

"కీ................."

"..................."

"ఇక లేవనివ్వండి"

"వచ్చిన పని—"

"ఇంకెందుకూ ?"

"సెబాస్!......రుక్కూ !"

"..................."

"రుక్మిణీ !"

"..................."

"నాకేసి చూడూ"

"..................."

"సిగ్గొచ్చిందా ?"

"..................."

"ఛా!...ఇలా చూడూ......నీరుణం తీర్చుకోడం యెలాగా ?"

"......నామాట కేం, మీకవిత్వం మీరు చేసుకుందురూ"

"అవునవును. దీని కదే తగింది. కవిత్వాని కింతకంటే వుద్దీపనం యేం వుంది! వురకలు వేసుకుంటూ వచ్చే స్తోంది ప్రవాహం"

"అయితే, నేను వాకట్లోకి వెళ్లిపోతాను బాబూ అందులో మునిగిపోతా నేమోనూ"

౪

"రుక్కూ!"

"....................."

"రుక్మిణీ!"

"....................."

"రుక్మిణీదేవీ!"

"....................."

"హృదయేశ్వరీ!"

"......మీాకు లేకపోతే పోయింది, నాకేనా వుండొద్దుటండీ సిగ్గూ?"

"వద్దన్నా నా రెవరూ?"

"మీాధోరణి చూస్తే సంసారం అంటే నాటకం అనుకుంటున్నట్టున్నారు మీారు"

"అన లిప్పు డేం వచ్చిందీ?"

"ముద్దుగను పేర్లూ పెట్టి పిలిస్తే—"

"పిలిస్తే?"

"వాళ్ల జానకమ్మ ముక్కుమీాద వేలుపెట్టుకుంది వినీ"

"పానకంలో—"

"స్స! వినపడుతుం దండీ"

"ఎక్కడుం దేమిటి?"

"ఇప్పు డిప్పుడే గుమ్మం—"

"ఎక్కిందా దిగిందా?"

"మీాపిలుపులవరస చూసి తేజా రయిపోయి, వచ్చిన దారినే వెనక్కి మళ్లింది"

"ఇంకేం మరీ?"

"వినపడితే?"

"ఇప్పుడూనా?"

"....................."

"....................."

"ఎందకూ పిలిచావూ?"

"కూచో చెబుతాను"

"....................."

"కూచోమని"

"ఇలా చాలదూ? ఇది బాగా లేదూ?"

"అదో అందం; కాని నీమొగం చూడా లంటే వెనక్కి విరగబడాలి. నువ్వు కుర్చీలో కూచుని నేనే వెనక నిలబడితే మరీ బాగుంటుంది. కాదూ?"

"మరే—పా—పం......పోనీ యిప్పుడో?"

"అంతగా విరగబడనక్కర్లేదు"

"....................."

"ఇందాకటికంటేనూ నయం"

"ఈమాటో?"

"మెల్లిగా అడుగుతున్నావా?..... వొళ్లు గరిపొడుస్తోంది......పారవశ్య—ం—"

"మీాకు పిచ్చెం—చెడగొడుతున్నా నని—కో—ప—పడ—కం—డేం?........అ-బ్బా! అ—బ్బా!......"

"...............ప్చ"

"......బాబోయ్!......"

"భయంలేదు, భయంలేదు. హెడ్మాస్టరుగార్ని పిలుస్తున్నాడు వాళ్ల జవాను"

"అమ్మయ్యా!"

"ఎవరినైనా మొత్తానికి రసభంగం చేశాడు వాడు. అయితే లే, యిలా రా, కూచో"

"గుండె లింకా కొట్టుకుంటూనే వున్నాయండీ"

"అమోఘమైన చికిత్స చేస్తాలే, మరీ కూచో..."

"......వుండండీ......ఎందుకో చెప్పండీ"

"....................."

"పద్యం రాశారా? దేనిమీాద చెప్పరూ?"

"చూపించరూ?"

"వినండి"

"నువ్వు చదువూ"

"కవులు తమ పద్యాలు తామే చదవడం కూడా తప్పు కాదుగదా కొంపతీసి ?"

"నీలాంటివాళ్ల దగ్గిర చదవడానికి కూడా యోగ్యత వుండాలి"

"బా—గా చెప్పారు, కనక మీరే చదవండి"

"అయితే విను—"

జాల మొకింతయున్ సయిపజాలని..................
... ... ... ... ... ...ఒక ల్పోకల్పై
వ్రాలి, కవుంగిటన్ బెనగు పట్టుల నిగ్గులు దేరు ప్రేమ...
............అత్యుత్తనయునమ్ముల ముగ్ధల దిద్ది తీర్చుతన్.

"......మధ్యమధ్య ఖాళీ లట్టే పెట్టారేం ?"

"చేతకాక"

"వులకం !"

"వేళాకోళం కాదు. అయినా నువ్వు పూర్తిచెయ్యి చూస్తాను"

"..................."

"కానియ్యి మరీ......పొరపాటున నే నెత్తుకున్నాను గాని, అస, లిది, కవయిత్రీమణుల్లు లెత్తుకోవలసిన ఘట్టం. అయితే, నువ్వు పూర్తిచేస్తే మాత్రం యిక నా తప్పుండదు"

"అ—లా—గేం! పా—పం!......అయితే—మరి—యొక్కిరించకుకదా ?"

"అబ్బే"

"తప్పొస్తే దిద్దుతారా మరి ?"

"నాతర మయితేనూ"

"చూశారా !"

"దిద్దుతాలే, దిద్దుతాలే"

"......నవ్వకం డేం ?"

"..................."

"......ఓరచూపులు చూస్తున్నారు"

"ఎంతసేపూ గునవడం!"

"అన్నీ కుదరాలా మరీ !......

జాల మొకింతయున్ సయిపజాలని రాధయు—

"రాధా ?"

"మరెవరూ ?"

"..................

జాల మొకింతయున్ సయిపజాలని రుక్మిణియున్—

"నేను చెప్పలేదూ ? మీ రెప్పుడూ నా మీదే పట్టిస్తారు......"

"ఇదిగో"

"..................."

"ఇలా రావూ ?"

"ఏమో బాబూ !"

౫

"ఏమంటావ్ ?"

"మీరే మంటారూ ?"

"నిన్ను వెళ్ళ మంటాను"

"..................."

"దసరాకి వెళ్ళక, దీపావళికీ వెళ్ళక, ఆఖరికి సంకురాత్రికేనా వెళ్ళకపోతే ఘోరంకలి అనిపించుకోదూ ?"

"..................."

"పైగా, మీ చెల్లెలూ మరిదీ కూడా నాలుగురోజుల క్రిందటే వచ్చారుట"

"..................."

"ఇరుగు మనం బొంబాయిలో వుండిపోయాం కనక నెపం లేకపోయింది. ఈయేడు ఇక్కడనే వుండికూడా—"

"మీకు సెలవు లేనప్పు డేం చేస్తామూ ?"

"నువ్వు వెళ్ళడాని కేం ? నేను శరీరం అమ్ముకున్నాను. నీకేం అడ్డూ ?"

"నేను మనసూ, హృదయమూ కూడా ధారపోసుకున్నాను......"

"......ధన్యోస్మి......రుక్కూ ! మాటిమాటికీ నీయెదటే నిన్ను స్తుతిచెయ్యడం పెద్దమనిషితరహా కాదు. మూడువందల రూపాయల జీతమూ, బాధ్యత గల పదవీ నీ కాలిగోటికి పోలవు. అవేనా, నువ్వు నాపాలిటి భాగ్యదేవతవు కనకనే వచ్చాయి. నిజంగా నాఅంత సిరిగల భాగ్యశాలి మరొకడు లేడు ; కాని మీ అమ్మగారూ, మీ నాన్నగారూ పెద్దవారైనారు. వారి ముచ్చట్లకి లోటు చెయ్యడం—"

"మీరు రాకుండా—మిమ్మల్ని విడిచి నేను వెళ్ల లేనండీ"

"ఇలా చూడూ......ఇదిగో......ఒక్క క్షణం నావంక విడిచిపెట్టి నాకేసి చూడవూ?"

"......................"

"ఒక్క మాట విను. అంతే"

"......................"

"పోనీ, అవిరళికితపోలంగా నేనా వొక్క మాటు ముఖం యిలా తిప్పావో"

"......................"

"......వెళ్ళవూ?"

"......................"

"నలుగురూ నాలుగు విధాలా నన్నంటారు"

"ఎవళ్ళ మంచిచెడ్డ లెవళ్ళకి తెలుస్తాయీ?"

"......ఇంకేం చెప్పనూ?"

"కథ చెప్పండి"

"శాస్త్రం చెప్పినట్టుంది......చివరికి మీ అమ్మగారికి నీమీదకూడా కోపం వస్తుంది"

"......చిన్న వుత్తరం చూడండి"

"నీకు కూడా రాశారూ మీ నాన్నగారూ! ఇంకేం?......ఇది మీ అమ్మగారి దస్తూరీ"

"చదవండి"

"నాగన్నతల్లిని దీవించి—"

"ఇంకా ముందు"

"మీ రిద్దరూ రావడమే—"

"ఇంకా ముందు"

"పోనీ, అతగాడికి సెలవు పుట్టదంటే నిజమే. అయితే, నువ్వేనా తప్పకుండా రావాలి. తప్పదు. నువ్విదివరకే రానందుకే చెల్లాయి నన్ను నిలవనివ్వడం లేదు. నీజవాబు చూసుకుని, నువ్వు రమ్మన్ననాటికి మీనాన్నగారు వస్తారు......చూశావా? మీ అమ్మగారు రాసింది చాలా న్యాయంగా వుంది......పోనీ, వీలుంటే నేను రానివ్వనా?"

"రెండో వుత్తరం కూడా చూడండి"

"......ఇది మీ చెల్లాయి రాసింది. ఇప్పుడేనా వెళ్ళకపోతే—"

"చదవండి"

"అక్కయ్యకీ, అక్కయ్యద్వారంగా బావగారికీ నమస్కారాలు—"

"ఇంకా ముందు"

"నేను మొన్న ఆదివారమే సపరివారంగా—సెబాస్! మహామంచిమాట వేసింది మరద లిక్కడ"

"పదిబంతుల తరవాత చదవండి"

"బావగారికి సెలవు లేకపోతే నీకూ సెలవు లేదా యేమిటమ్మా?—చూశావా? చివరికి ముక్తాయింపు నామీద—"

"మరో నాలుగుబంతులు దాటించి చదవండి"

"రేపు సాయంత్రం—ఆరుగంటలకి—రైలుకారుతో వస్తావా, సంతోషమే. లేకపోతే, నీకోసం—అంటే నిన్నిక్కడికి తీసుకురావడానికి ఎల్లుండి పొద్దుటి పాసెంజరులో నేను వస్తున్నాను అప్పటికేనా నువ్వు ప్రయాణం తెమల్చుకుని, నాకోస మీనా స్టేషనుకి వస్తే, అక్కణ్ణుంచే వెనక్కి మళ్లీ, మెయిలెక్కి మనం కాకినాడ రావచ్చు......చూశావా?...ఇక మోటతనం అనిపించుకుంటుంది. నామాట విను"

"......................"

"పోనీ, వచ్చి మీఅక్కయ్యని తీసుకువెళ్లవలసిందని మీ చెల్లాయికి రాయనా?"

"ఓపనిచేస్తారా?"

"ఏమి టదీ?"

"కోప్పడరుగదా?"

"ఎప్పుడేనా వుందా?"

"......................"

"......................"

"చెప్పెయ్యనా?"

"ఆలస్యం దేందుకూ?"

"మా చెల్లాయినీ మా మరిదినీ—"

"ఇక్కడికి తీసుకు వద్దామా? చాలా బాగుంది"

"......................"

"సెబాస్!......అయితే వెళ్లి పిలిస్తే గాని బాగుండదు......పగలు వీల్లేదు కనక రాత్రిబండిలో వెళ్లి పిలుచుకు రానా?"

"రాత్రి నే నొక్క త్తినీ వుండనా యిక్కడా ?"

"తెల్లవారే టప్పటికి వచ్చెయ్యనూ ?"

"నా కేమీ తోచదండీ......ఒక్క కును కేనా రాదు. తెల్లవారే దాకా మంచం నడు మెక్కి కూచో వాలి"

"పోనీ, మనం యిద్దరమూ వెడదామా ?"

"ఏం బాగుందో బాగుంది. ఈమాత్రం భాగ్యా నికి—"

"మీ చెల్లాయి కోసం కాదిదంతానూ. మీ మరిది—"

"అతిగా డేం ఆకాశంనుంచి వూడిపడ్డాడా యేమిటి? నేను త్తరం రాస్తాను జవాను ని పంపండి"

"నాకు ధైర్యం చాలడం లేదు"

"అదంతా నేను చేస్తాను కాదూ?...మా చెల్లాయి మాటకి అడ్డు చెప్పగల డేం అతనూ ?"

"అసలు మీ చెల్లాయి మాట ?"

"అది వోట్టి వెర్రిపిల్ల. నావుత్తరం చూసిం దంటే యెగిరిగంతు వేసుకుంటూ వస్తుం దది"

"అయితే చిక్కే"

"ఏం ?"

"ఇదేమి టండోయ్, మీ మరదలు—అంటూ నలుగురూ నన్ను చూసి నవ్వుతా రేమో గదా ?"

"......మీ కొంటెమాటలు..... ఏం ?"

"హాయ్, హాయ్ !"

"..................."

"బుగ్గపోటుకంటె యిదే బాగుంది. పార్వతీ పరమేశ్వరుల కేనా యింత యేకీభావం వుండదు"

"నాకు కోపం వచ్చిందంటే బాగా జరగదు, ఏమను కున్నారో ?"

"ఏదీ, ఆమాట నా కేసి చూస్తూ అనూ"

"............ఏమండీ, మా చెల్లాయిని తీసుకు రావద్దూ ?"

"నేను వద్దనగలనా!, కాని వారి నిద్దర్నీ తీసుకు వచ్చి మీ అమ్మగారినీ, మీ నాన్నగారినీ—"

"వచ్చివులునూ అన్నమూ తినమని వండుగల్లో వారి నిద్దర్నీ అక్కడ అట్టేపెడతామూ యేమిటి?"

"అలా అన్నావు బాగుంది. ఈమాటు నాకు నచ్చింది"

"ఉత్తరం రాసి తీసుకురానా ?"

"తీసుకు రా"

"ఎందు కేనా మంచిది, మానాన్నగారికీ, మామరిదికీ కూడా మీరు రాయండి"

"అలాగే"

"మాఅమ్మగారికి మాత్రం నేనే రాస్తాలెండి"

"సరే"

"........ పోనీ, యీపాటికి వంట అయిపోతుం దేమో, కుక్కరు దింపి, అన్నీ సిద్ధం చేసి మిమ్మల్ని పిలవనా, ముందు వుత్తరాలు రాసుకురానా?"

"పది నిమిషాల్లో రాయలేవూ?"

"అంతసే పెందుకండీ నాలుగేసి మాటలు రాయ డానికి ?"

"వుట్టింటికి వుత్తరం రాయడం అంటే కలమూ కాగితాలూ పుచ్చుకూచోడం తోరగా తెములుతుంది; కాని ముగించడం మాటలతో యెప్పుడూ కాదుగా?"

"అలాగే ? .........ఎప్పుడో, పొద్దున్న అనగా పుచ్చుకున్న కాఫీ. మీరు రాయమన్నారు కనక విధి లేక వొప్పుకున్నాను గాని, లేకపోతే, కసింత ధారకం పడితే గాని నాసల్లకాదు బాబూ వుత్తరాలు రాయడం. కాకపోయినా, మావాళ్ల కసలు వుత్తరమే అక్కర్లేదూ. కాకిచేత కబురు పంపితే వచ్చేస్తారు"

"అయితే యిక వుత్తరం యెందుకూ కాగితాలు దండుక్కి ?"

"మామరిదికి రాయా లన్నారు కాదూ మీరు?"

"అతనికి నేను రాస్తాను కదూ!"

"మీతమ్ముడికి మీరు రాశాటప్పుడు మాచెల్లాయికి నేను రాయకూడదు టండీ?"

"..................."

"కాకపోయినా, మీరు రాత పూర్తిచేసి భోజనానికి వచ్చేదాకా నేను గోళ్లు గిల్లుకుంటూ కూచోడమే కాదూటండీ!"

"....................."

"పోనీ, మా అమ్మగారికీ, మా చెల్లాయికీ కలిపి ఒక్క వుత్తరమే రాస్తాను లెండి మీ కంత కష్టంగా వుంటేను"

"....................."

"మా నాన్నగారికి మాత్రం, మీరు రాసిన వుత్తరంలోనే నాలుగుబంతులు, కింద, రాస్తాను......సరా!"

"ఇక నువ్వు రాయం దల్లా మీ మరిది ఒక్క డికేని"

"మీరు రాయవలసిం దంతా రాశాక, "మీ వదినగారు యిక్కడికి రావలసిం దని నీకు రాయమని మరీ మరీ చెప్పిం దని మీరే రాసేయండి ఒక్కమాట"

"మొత్తానికి నాటకంలో ఒక్క అంకం అంత గ్రంథం నడిపావు"

"కష్టపడకుండా మీ నాటకంలో ఒక అంకం దొరకడం మీకే నయం కాదూ!"

"అయితే, తక్కింది కూడా పూర్తిచేసిపెడతావా నువ్వు!"

"మామ్మో! కష్టపడి నేను రాస్తే, మీరు రాసినట్టు ప్రకటించుకుంటారు కామోను పా—పం"

"పురుషుల అవ్యాజకరుణా కటాక్షంవల్ల, తెనుగుదేశంలో, యివ్వాళ, అక్షరజ్ఞాన మేనా లేని స్త్రీ లెంతమంది కవయిత్రీమతుల్లు లయిపోతున్నారో మరిచిపోయావా!"

"ఆసంగతి తెలిస్తే, ఆస్త్రీలు, ఆపురుషుల కెలాంటి సత్కారం చేస్తారో యేమేనా వూహించారా మీరెవ్వ డేనా!"

"......గట్టిచిక్కే తెచ్చిపెట్టావు"

"దీంతో అయిపోయిం దనుకున్నారా యేమిటి! ఆంధ్రమహిళాసభలో యీ విషయం ఒక తీర్మానం కూడా నెగ్గిస్తాను చూస్తూవుండండి"

"వద్దువద్దు. ఇంతటితో చాలించు నీకు పుణ్యం వుంటుంది. ఆ ఆడంగిరేకలవారిని అలాగేనా బతకనియ్యి. మరి వెళ్లి వుత్తరాలు రాసుకురా"

"నిమిషంలో వచ్చేస్తా నండీ; ఏం!"

"తొరగా వెళ్లు"



"......మీకు భోజనానికి ఆలస్యం అయిపోయింది పాపం! పోనీ, భోజనా లయినాక రాసి ఆఫీసుకి పంపిస్తా నండీ"

"ఏమీ ఆలస్యం కాలేదు. ముందు వుత్తరాలే రాసుకురా"

"మాటల్లో పడి ఎంతపని చేశానూ!......"

౬

"......ఇవాళ చేమకూర మంచి పాకాన పడింది సుమా!"

"మీరు నాహృదయం అంతా వుత్సాహంతో నింపేశారు కాదూ!"

"అయినే!"

"అంచేత పొంగు వు సరిగా పడింది"

"అహా కథా! అలా అయితే, నువ్వు చేసిన ఆదరం నన్నానందసాగరతరంగాలమీద వూపెయ్యలేదూ!"

"......ఎటొచ్చినా వినుగు నామీదే"

"తప్పుతుందా మరీ! నాలుగుగోడల మధ్యా వున్నంతసేపూ స్త్రీకి వుండే బాధ్యత పురుషుని కేం వుంటుందీ!"

"......అయితే, మొగాడు కొంక నక్క అయితే ఆడ దేం చెయ్యగల దండీ!"

"తల్లి, బాధ్యత తెలిసిం దయితే వా డలా కొంక నక్క కాడుగా!......"

"....................."

"దీనివల్ల మొగాడు ఏంచేసినా చెల్లిపోతుం దనీ, ఆడదానికి, సంసారంలో, కష్టం తప్ప మరేమీ లేదనీ అనుకోకు. మొగాడు సంసారంలో కేవలమూ వుపకరణం... వివరంగా చెబుతాను విను. మొగాడు పదునైన బాకు అనుకో. పీరుడి తెలివితేటలను పట్టే కాదూ ఆబాకుకి వినియోగం!"

"అయితే, మన పెద్ద లంతా ఆబాకుని చంటిపిల్లల చేతి కిస్తున్నా రన్నమాట కాదు టండీ?"

"ఇంకా సందేహమేం!......చదువు చెప్పించక—చిత్తానికి పరిణతి కలిగించక—హృదయానికి వుత్తేజనం యివ్వక—చిన్నతనంలోనే ఆడదానికి పెళ్ళిచెయ్యడం అంటే అంతే కాదూ అర్థం!"

"......మానాన్నగారు మంచివారు. కారుటండీ!"

"కనక నే నే నదృష్టవంతుణ్ణి—"

"రెండు ముక్కలు వెయ్యనా!"

"ఇంకెందుకూ, చారుకూడా అయిపోయాకా ?"

"................."

"...................."

"ఎంత కమ్మగా వుందో మీగడ ?......"

"ఎంత తియ్యగా వున్నాయో పాలు ?......"

"కొత్తగొల్లాడు మహా మంచివాడు సుమండీ పాపం"

"పండుగల్లో నాడి కవీ, యివీ పెట్టకపోతే మాత్రం తెలుస్తుంద పాపమో పుణ్యమో"

"పెద్దపండుగనాడు పళ్ళాన్ని తీసుకుని విందుకు రమ్మన్నా నండీ వాణ్ణీ......"

"......మంచిపని చేశావ్! అయితే యీపండుగల్లో మన యింటో వుండేవా ళ్ళంతా జోడాలే అన్న మాట......"

"......అలా అయితే వోచిక్కు వచ్చిందే ?"

"ఏమి టదీ ?"

"......పనిమనిషి పితంతువు కదా ?"

"ఓహోహో ! చిక్కే !......అయితే పండుగ నాలుగురోజులూ దాని కోడల్ని రమ్మను పనికి. పెద్ద పండుగనాడు, దాన్ని, మొగుణ్ణి తెచ్చుకోమను విందుకి"

"మునలిముండ ఏడవదూ ?"

"ఏడ్చినా సరే, ......మరేం చేస్తామూ ? మన యింటో విజ్జోడు వ్యవహారాలు పనికిరావు కాకపోతే, దానికి పెట్టవలసిం దేదో కోడలి కిచ్చి యింటికి పంపే సెయ్యి"

"అంతే కదా పాపం ? మహా మంచి ముండ సుమండీ అదీ ?"

"అంచేత నేనా యేమిటి ముండ అంటున్నావు ?"

"...................."

"నవ్వుకుని వూరుకుంటావేం ?"

"మీమీద సొడ్డూ"

"నిన్న రాత్రి ముందు నువ్వే లేచావుగాదూ ?"

"అ—వ్—వ"

"ఏం ?"

"చాల్లెండి నెవ్వుకున్నారు. ప్రతీపూటా యిద్దరమూ ఏకబంతిని తింటున్నా మని అందరికి తెలవాలి కాబోలు"

"ఇదివరకే తెలుసు నంపిటికీసి. మనల్ని చూసే హెడ్ మాస్టరుగారు కూడా యేకబంతి మొదలు పెట్టారు"

"కూచోండి అలాగ మీయిష్టం వచ్చినంత సేపు"

"...................."

౭

"ఈరెండాకులే. ఇవి వేసుకోకపోతే నన్ను చంపు కుని—"

"సుశూ ! నువ్వు నన్నెలా విడిచిపెట్టలేకుండా వున్నావో, నిన్నూ నే నలాగే విడిచిపెట్టలేకుండా వున్నాను ; కాని అప్పుడే పదకొండూ అయి దయింది. ఇక్కడికే అయిను—"

"ఆఫీసు కంపెటికి మీరే పెద్ద కదా, మిమ్మల్ని అడిగేవా రెవ రండీ ?"

"నేనే తప్పు చేసి యిక గుమాస్తాల నేం ముదల కించనూ ?"

"...................."

"మళ్ళీ చిలక చుడుతున్నావు. చూశావా ?"

"ఇక మిమ్మల్ని బలవంత పెడితే అడగండి, ఈచిల కలో నగం......"

".........ఇక లే"

".........ప్చ..."

"........పాగా"

".........జుట్టు కొంచెం చెదిరిం దండీ"

"పాగా పెట్టుకుంటే.........ఏం ?"

"...................."

"...................."

"...................."

"లోపలికి వెళ్ళు"

"మీరు సైకిలుదగ్గిరికి వెళ్ళండి"

".............ఇక వెళ్ళు"

"సైకిలు స్టార్టు చెయ్యండి"

".............ఊ"

"ఎక్కండి"

".............వెళ్ళు మరి"

"ఒక్క నిమిషం......అరనిమిషం .........క్షణం ......ఉండరూ ?. ఉండరూ ?.........దిక్కుమాలిన బస్సు, ఇదెక్కడ వచ్చిం దమ్మా మమ్మల్ని విడతియ్యడానికి ?........."

# డయాన్థస్

విశ్వనాథ సత్యనారాయణగారు ఎం. ఏ.

డయాన్థస్ గ్రీసు యువకుడు. అతడు పూర్వకాలమునం దెప్పుడో బ్రదికియుండెను. అప్పుడు గ్రీసుదేశములో నున్నవా రందఱు దేవతలతో సమానులు. దేవతలు భూమిమీదికి వచ్చుట, మనుజులతోఁ బ్రసంగించుట, యుండుచుండెడిది. ఆకాల మెటువంటిదో కాని యార్ద్యసూయాదిగుణములు కూడ దేవతలవలె వచ్చి మనుష్యులతోఁ బ్రసంగించుచుండెడివి.



డయాన్థస్ మిక్కిలి యందగాఁడు అట్టి ముఖలక్షణములు గాని శరీరావయవములు గాని కలిగినవాఁ డెప్పు డుండినచో నతనిని మన మందగాఁ డని యనము. కాని యాదినములలో నాదేశములో నతఁ డందగాఁడు. అతఁడు బక్కపలుచగాఁ బొడుగుగా నుండెడివాడు, అతని శరీరము మిక్కిలి సన్నన. అతఁడు గాలిలో నూగులాడుచు నడచును. అతనికి రంగులు గల సుస్తు లన్నచో నెక్కువ యిష్టము. అతఁడు రోజాన కొక్కెర రంగు గల ధోవతియు నుత్తరీయమును ధరించెను.

అతని సౌందర్యముయొక్క ప్రశస్తి నాల్గుదెసలందు వ్యాపించెను. దేవతాస్త్రీ లందఱు వచ్చి యతనిని జూచి మోహించెడువారు. అతఁడు పుష్పసుకుమారుఁడు. తుమ్మెదలు వచ్చి యతని శరీరావయవము లపై వ్రాలి తేనియ కనిపించక యెగిరిపోవుచుండెడివి. అతనికిఁ గ్రమక్రమముగా దాను గొప్ప సౌందర్యవంతుడ నని తెలియవచ్చెను. యౌవనారంభసమయమునుండి, వాని సౌందర్యము మిసమిసలాడెను. అతని నాసిక తుద చక్కని సన్నని దిమ్మకట్టి నాసారంధ్రములు కొంచెముగా నుబికి ముక్కు పొడుగై సొగసు లొలికెను.

చెవులు నిక్కి బంగరు ప్రమిదలవలె నయ్యెను.

వాని కన్నులు మీనులు పెట్టి పొడిచినట్లు చూడసాగెను. అతని కనుగ్రుడ్డులో నల్లపాప తుమ్మెదలకుఁ బ్రేమావిషయమును బ్రాలబోవుటానికి నతని హస్తకౌశల బాధాజనకము నైనది.

అతని పెదవి లేత యెఱ్ఱ కాంతి పరిజిమ్మి దినదినము క్రొత్తది క్రొత్తదియా యనిపించుచుండెను.

అతని చుబుకము పొట్టిదై ముద్దుగా నడుమున కొద్దిగాఁ జీలినట్లు వాని మొగమునకు క్రొత్త శోభ తెచ్చెడిది.

యౌవనాంకురముతో నతనికి మీసములు వచ్చెను. అతని యెఱ్ఱని మొగముమీద నల్లని మీసములు తుమ్మెద రెక్కలవలె ప్రకాశించెను.

శరత్కాలపు నదివలె నతని మనస్సుకూడ స్వచ్ఛమై యా స్వచ్ఛత యంతయు నతని పంచేంద్రియములయందు వ్యాపించెను.

అతని సౌందర్యమును గ్రీసుదేవతలు చూడలేకపోయిరి. వాయువిధులు పట్టలేకపోయినవి.

అతఁ డితరు లైన గ్రీసుదేశపు సౌందర్యవతులగూర్చి వినెను. ఒకఁడు నార్సిసను. నార్సిస నీయుండకత్తెను (Narcissus) ప్రేమించలేదు. ఆయందకత్తెల నతఁ డందకత్తెలుగానే భావించలేదట. డయాన్థస్సున కీసంగతి తెలిసెను. డయాన్థసునకుఁ జాలమంది స్త్రీ లందకత్తెలుగాఁ గనిపించిరి. నార్సిసను డయాన్థసు నందగాఁ డనలేదట. అందుచేత నితని కతనిమీదఁ గోపమువచ్చినది. అందకత్తెల సంగతియే తెలియనప్పు డందగాఁ డెట్లగునని డయాన్థస్సు నార్సిససును దిరస్కరించెను. వారిరువురకును సౌందర్యాభిమానమునఁ జేసి యొకరి నొకరు చూడని విరోధము కలిగెను.

మఱియొకఁడు ఎండిమియాను. అతనిని చంద్రమండలాధిదేవతయైన స్త్రీమూర్తి ప్రేమించినదఁట. అతఁ డొక రేయి నిహరించుచుండ నాచంద్రతేజోదేవత వచ్చి వానిని ముద్దిడుకొన్నదఁట. డయాన్థసు సర్వజగత్సృష్టిలో నున్న శైత్యస్వచ్ఛతలకు నిధానమైన యాచంద్రజ్యోతిరంగనను దాను ప్రేమించెను. స్త్రీసంస్థానమైన యాచంద్రతేజస్సీరము ఎండిమియానును ముద్దుపెట్టుకొన్నదఁట. డయాన్థసునకు ఎండిమియానుమీద గోపము కలిగెను.

డయాన్థసు బహుదేవతాస్త్రీలను గామించెను. సౌందర్యముయొక్క యథార్థస్వరూప మెఱుఁగనివా రతనిని ప్రేమించలే దని యతని విశ్వాసము.

మెఱుగు పెట్టిన వెండిబిళ్లలలో డయాన్థసు తన మొగము చూచుకొనును. ఆహా! అది యెంత తీర్చిన నాసిక! అల్లుకొనిన తీగవలె నాచెవు లెంత యందముగా నున్నవి? అవి కన్నులా! సూర్యతేజస్సున కభిముఖముగా నున్నట్లున్నవి. అది పెదవి. సర్వకామినీ భోగయోగ్య మైన బాలారుణచ్ఛవిభాసమానముగ నున్నది. ఆచిన్నగడ్డము! దానితోఁ బ్రియామూర్ధభాగమున నదిమినచో నది పులకరింపుల కవధి. అతని మీసము లతనికే యచ్చెరువు కల్పించినవి. చమరీమృగము తోఁకకన్న నిగనిగలాడి, గాఢకాదంబినీమాలచ్ఛవికిఁ గేళీస్థానమై తుమ్మెద రెక్కలకుఁ జక్కనలు దిద్ది నివ్వెఱపాటునై వాని సొగసు పట్టరాకపోయినవి. ఈసౌందర్యము ముందు నార్సిసుని సౌందర్యమా? ఎండిమియాను సందమా? ఛీఛీ! లోకము మిథ్యాప్రవాదము. నార్సిసుసు రాజకుమారుఁడు. అందుచేత లోకము వానిని పొగడుచున్నది. ఎండిమి

యాను తల్లి దేవత. అందుచేతఁ జంద్రజ్యోతి వానిని ప్రేమించినది. అంతియకాని వారి యెడల సౌందర్య మున్నది లేదు.

ఒకనాఁడు డయాన్థసు తన చెలికానితో మాటాడుచుండెను. అతని ముందు డయాన్థసు తన సౌందర్య శత్రువులను నిందించుచుండెను. "నీవు నార్సిససును గాని, యెండిమియానును (Endymion) గాని యెన్నఁడు చూచితేదు కదా! వారందగాండ్రు కారని నీకెట్లు తెలియును?" అని మిత్రు డడిగెను. డయాన్థసున కీప్రశ్నతో గోపము వచ్చెను. ఆనాటితో వారి చెలిమి యంత మైనది.

౨

డయాన్థసు కడుపు మండిపోఁదొడఁగినది. తాను ప్రేమించిన యాదేవతా స్త్రీయుఁ దన్నుఁ దిరిగి ప్రేమించలేదు. లోకమునందలి స్త్రీ లందఱు వానిని దేవతా సౌందర్య మని మెచ్చుకొందురు కాని ప్రేమించరు. అతని చెవులయందు నిత్యముగా నతని శత్రువుల గుణస్తుతులే పడుచుండెను అతఁడు హృదయములోని బాధను దాఁచుకొనలేక పోయెను. అతని పంచేంద్రియములు నతని మనస్సును నట్టుడికిన ట్లుడికిపోయెను.

డయాన్థసు జనపదములయం దోర్చుకొనలేక పోయెను. ఇది కలఁడు దానందగాఁ డనుకొనిన లోకము తన్నుఁ జూచి వెక్కిరించుచున్న దని యతఁ డూహించెను. వారి నతఁడు సర్వదా నిందించెను. అందఱితోఁ బగపెట్టుకొనెను. దీనిమూలమున నతనికి జనపదవాసము మిక్కిలి కష్ట మయ్యెను. అతని వేడిపించుటకుఁ జాలమంది మనసులో నతఁ డందగాఁ డని యనుకొనుచుఁ గూడ ఛీ, ఛీ యితఁ డేమి యందగాఁ డన నారంభించిరి. తన గుణము చేతఁ దెచ్చుకొన్న యీవిరోధము నతఁడు తన గుణమునకుఁ గాక లోకము యొక్క బుద్ధిమాంద్యమున కంటఁగట్టెను. ఇట్లు లోకమునకు నతనికిఁ జెడిపోయినది.

ఒకనాఁటి ప్రొద్దున నతఁడు తా నడవులకుఁ బోయిన నీ బాధ తగ్గు నని తలఁచెను. పోవుచుండగా నాతని యెదుట నొక స్త్రీ నిలఁబడెను.

ఆమె యీర్ష్యాధిదేవత. ఆమె కన్నులరంగు ఆకుపచ్చన. (Green eyed jealousy) ఆమె యతని నడవులలోనికిఁ బోగ దన్నది. తా నతనిని రక్షించెద నన్నది. ఆమె నతఁడు వెంటఁబెట్టుకొని తన యింటికిఁ బోయెను.

డయాన్థసునకు నామెమీఁదఁ బ్రేమ లేదు. కాని తన్నెవ్వరుఁ బ్రేమించలేదు. ఎవ్వతెయో యొకతె తన్నుఁ బ్రేమించినందు కతఁడు సంతోషించెను. తాను ప్రేమించవలయు ననుకొన్న కీర్తిమెంద లైన దేవతలు తన్నుఁ బ్రేమించకపోయి రన్న విచారము వాని హృదయములో నత్తుకొనిపోయెను. అది యతని మొగములో నొత్తుకొని వచ్చెను. ఈ నిగూఢదుఃఖ మీర్ష్యాదేవి పొందిన యలుపదుఃఖము వాని మొగమునఁ గలసి, వాని మొగ మొక వికారము పొందెను. భిన్నగుణములు కల వస్తువుల కలయిక వికృతిహేతువు కదా!

ఈర్ష్యను గ్రీకులు దేవత యన్నను నామెను గౌరవించలేదు. డయాన్థసు లోకమును జ్ఞానహీన మని నిందించి యా యీర్ష్యాదేవత, యందఱు దేవతలకన్న గొప్పది యని వాదించెను. ఆమె యాకుపచ్చని కన్నులు చూచి లోకము భయపడెను. ఆమెను జూచి పసిరికపామును జూచి లోకము కలఁతపొందెను. కాని డయాన్థసు నామెను కౌగిలించుకొని యామె కన్నులలోనుండి యామె హృదయము దాకఁ జూచెను

క్రమక్రమముగా నామె సంయోగమువలన డయాన్థసులో మార్పు కలిగెను. ఈర్ష్యాధిదేవత మొగ మతని మొగముతోఁ గలసినపు డెల్ల నతని ముఖావయవములు మార్పుఁ జెందెను. అతని ముక్కున నూదారంగు వచ్చెను. ఆ ముక్కు చివర తేలి, యది యెఱ్ఱవాగు పసుపుగా మారెను. చివర తచ్చని సన్నని దిమ్మవలె నయ్యెను.

అతని చెవులు తీగవలె నల్లుకొన్నది, చివళ్లు పెరిగి సీటిప్రబ్బలి వలె నయ్యెను.

అతఁడు లోకమునకుఁ జూచుట మాని వేసి నిత్యము సూర్యమండలము వంక నే చూడ నారంభించెను అతని కన్నులలోఁ దెల్లగ్రుడ్లు నారింజరంగుగాఁ దిరిగెను. నల్లగ్రుడ్డు ఎఱుపురంగు కలిపిన పసపురంగు తిరిగెను. ఆ కన్ను లంతకంతకుఁ బెద్దవై ప్రొద్దుపొడుపువలెఁ గనిపించెను.

అతని పెదవి లేతయెఱుపు మానలేదు. కాని దానిమీద తెల్లని బొట్లవలెఁ జిన్నిచిన్ని మచ్చలు కలిగెను.

అతని చుబుక మూడు పచ్చరంగుగా మారెను. చివర మద్దగా నున్నభాగము గట్టిపడి దిమ్మకట్టెను.

వాని మీసములు నారింజరంగు ప్రబలించుకొనెను. చిట్టచివళ్లు నల్లగా నే యుండెను.

ఈ మార్పు లోకము గ్రహించెను. దినదిన మతఁడు మునుపటికన్న యందగాఁ డగుచుండె నని లోకము గ్రహించినది. అతఁడు లోకాతీతమైన సౌందర్యవంతుఁ డని నిస్సంశయముగాఁ దెలిసినది. లోకమునందెల్ల జనులకు నతని వంకఁ జూచుట, యతనిని బొగడుట. జన్మచరితార్థము చేసికొనుట యనిపించినది. కాని యెవ్వరు నట్లు చేయలేదు.

కాలము గడచినది. ఈర్ష్యాదేవత పరమరాక్షసి. ఆమె యొడలి నిండ నెత్తురు లేదు. విష మున్నది. కొంతకాల మామె సంయోగము చేసినచోఁ బురుషులు చనిపోదురు. ఆమె యొడలిలోని విషము మనుజాల యొడళ్లలోనికిఁ బ్రవహించి, వారు క్రమముగా క్షీణించి నశించిపోదురు.

డయాన్థసు సౌందర్య మంతయు నసలే దేవతాసౌందర్యము. ఈదేవతాసంయోగము చేత నతని శరీరరేఖలే కాక యతని శరీరములోని రక్తబిందువులు కూడ నస్థిచయముకూడ, ఱేవులుకూడ, మాంసముకూడ నొకానొక దివ్యత్వమును సంపాదించుకొన్నవి. అదివ్యత్వము పెరిగినకొలంది నతనిలోని మానవత్వము క్షీణింపజొచ్చెను.

అనాటి యతని మానస మొక విచిత్రస్థితి బొందినది. అమానసము నంటియున్న యైదింద్రియములు చిత్రముగా మారెను.

నేత్రములు పసుపుపచ్చదనము పొందినను నతని చూపు లాకుపచ్చరంగుగా నుండెను. ఈర్ష్యాదేవత తన ముద్ర ఘటిల్లెనని సంతసించెను.

నాసిక యూదారంగుగా మన్నను జిట్టచివర నాకుపచ్చ దిమ్మకట్టెను.

చెవులు నీటిప్రబ్బలివలె నీలపురంగుగా మారినను నొక విధమైన యాకుపచ్చని రంగు వానియంతట నావరించి యుండెను.

అతని నాలుక యాకుపచ్చని రంగు పొందెను. అతఁడు సామాన్యముగ నోరు తెఱువడు. ఈర్ష్యాదేవతారహస్సంగమవేళ నీర్ష్య యతని పెదవి ముద్దాడి నోరిలో నోరు పెట్టి తన దంతములచేత నతని జిహ్వాగ్రమును గొఱికి యతఁడు కొంచెము బాధపడగా నొచ్చుకొని ఒకిమారి నాలుక చాపించి చూచెను. అతని ప్రాణములోఁ దాను స్థిరపడినందుకు మిక్కిలి సంతోషించెను.

అతని శరీర మంతయు నాకుపచ్చని రంగు తిరిగెను.

౩

ఒకనాటి ప్రొద్దున డయాన్థసు ఈర్ష్యతోఁ పోట్లాడెను. "ఛీ ఛీ! నీమూలమున నేను చెడిపోతిని. మాబంధువు లందఱకు దూరమైతిని. నేను మానవుఁడను. మానవలోకమునకు నే నెడమైపోతిని. నీ వేగడియ నాయొద్దకి వచ్చితివో యాగడియకన్న బాపపుగడియ లేదు. నీవు దేవతవు. నీకుఁ గనిపించుచున్న యీశరీరము నిజమైనది కాదు. నీ వీ శరీరమును లీలగా గ్రహించితివి. నీతో సంపర్కము చేసి నేను మానిసిగా నుండుట మానివేసి యొక భావముగాఁ దయారైతిని. నన్ను నావారు మెచ్చుకొనుట లేదు." అనెను.

ఈర్ష్య యతని వంక నిదానించి చూచెను. తా నిన్నాళ్లతనితోఁ గాపురము చేసినను ప్రధానమైన యతని మనస్సు వికారము పొందలేదు. అతని యాత్మ మార్పు పొందలేదు. అది దుంపజాతి. అతని పంచేంద్రియములు, మనస్సును దన సంపర్కముచేత మారినను వాని యందు మార్పు పొందని యాత్మలక్షణమైన యొక తెల్లన భాసించుచునే యుండెను.

ఈర్ష్య తన యధికారపు హద్దు తెలిసికొని లేచిపోయెను.

ఈర్ష్య లేచిపోయిన సంగతి డయాన్థసు లోకమునకు దెలియజేయలేదు. అతనికి లోకముమీద నొక విధమైన కోపము వచ్చినది. ఈర్ష్య తనయింట నున్నంతమాత్రమున దనతోఁ బుట్టిన మానవజాతి తన్నింత తిరస్కరించవలయునా? యని వారివంకఁ జూడలేదు. ఈర్ష్య తాత్కాలికముగ లేచిపోయిన దనియో, యతని యింటిలోననే యున్న దనియో లోకము తలంచి యతనివంకఁ జూడలేదు.

డయాన్థసునకు మనసు తిరిగెను. అతని సౌందర్యము భూలోకమున కలంకారప్రాయమైనది. తానింతటి సౌందర్యము కలవాఁడై లోకమునకు మే లేమి చేసెను? లోకము తన్ను దిరస్కరించినమాట నిజమే. తాను వారి కేల యుపయోగపడరాదు? తన పేరు మీఁద మహాసుందరమైన యొక శాఖను మానవజాతిలో సృష్టింపలేదు. తన సృష్టి యిట్లు వృథా యైపోయెను. ఈదిగులులో నతఁడు కొంత చిక్కి యొకనాఁటి సాయంకాలమున ప్రాణము చల్ల నగుట కొక సరస్తీరమునఁ జేరెను. అందుఁ గూర్చున్నవాడు కూర్చున్నట్లు క్రుంగిపోయెను.

౪

చాలకాలము గడచెను. అతని శరీరమును మృగములు, పక్షులు, పురుగు లేమియును ముట్టలేదు. హారతికర్పూరము వలె నది హరించిపోయెను. అతని శరీర మొకచోట, శిర సొకచోటఁ బడెను.

డయాన్థస్ :—అతని ముఖావయవములనుండియు, నతని శరీరమునుండియు నతని యింద్రియములనుండియుఁ జక్కని పూలమొక్కలు పుట్టెను. అతని పేరులో నెనిమిది యక్కరము లుండెను. ఒక్కొక్క యక్షరమున కొక్కొక్క మొక్కగా బయలుదేరి యతని సౌందర్యమును లోకముచేత నొప్పించెను. అతని శరీరము పడిన చోట నతని పేరుతోడనే యొక పూమొక్క మొలిచెను. అతని శరీరమువలె నదికూడ నొక పెడదైన గరికవలె నున్నది.

అతఁడు రంగుగల దుస్తులు ధరించినట్లా మొక్క రకరకాల రంగులఁ బూచును.

ఇపోమియా :—అతని చెవులు పడినచోట ఇపోమియా యను పూలమొక్క మొలచెను. దాని పూవులు నీలిగరిటలవలె నుండెను. అవి నీటిప్రబ్బలిపూల వంటివి.

ఎమోరిలిస్ :—అతని పంచేంద్రియములును నతని మనస్సును గలసి దాని యాకులుగా, నతని యాత్మ దుంపగా, నీ పేరుగల దుంపజాతి మొక్క పుట్టెను. దాని కాఱు రేకు లుండును. ఇవియే యతని పంచేంద్రియములు, మనస్సును. అతని యుడికిపోయిన యెదవలె దుంప యెఱ్ఱగా నుండి యాఱు రేకులు నీర్ష్యచేత నాకుపచ్చనై పశ్చాత్తాపమువలన గలిగిన తెల్లదనముయొక్క చారవలెఁ బ్రతిరేకులో నుండును.

నెస్టూరియమ్ :—అతని మీసాలు మొదటి నారింజరంగు, చివరి నల్లదనము, నీ పూవుమొక్క పూవులవలె భాసించెను. ఈ మొక్క బంగారు రంగు పూలు పూచును. దాని రేకలు తుమ్మెదరెక్కలవలె నుండును.

లెబిరోజ్ :—ఇది యతని చుబుకము. ఇది యతని గడ్డమువలె పొట్టి మొక్క. క్షుద్రపూలు పూచును. ఏటేట నది తొందరగాఁ

జాతిని ఉద్ధరించిన పుణ్యాము కట్టుకొనలేకపోయినారు. ఒకరు స్వయంగ్యగా మనలను నిరసనచేస్తే, అందులకే మనం కుమిలి చావ సిద్ధమై యున్నప్పుడు రెండవ ఆయన నిర్దయతో "మనవాళ్లు పట్టి శెధవాయిలోయి" అని చిరస్థాయిగా ఉండిపోయేటట్టు ఢంకాకొట్టి నట్లుం చాటి చెప్పినాడు. ఈ దుస్థికి ఆంధ్రుడనని గర్వపడే ప్రతివాడూ దుఃఖపడవలసినదే ఇంతవఱకు, ఒక్కడు కూడా ఆంధ్రుని ఉద్దేశించి, "నీజాతి గర్వింపగగినవిషయ మిది నీలో ఉన్న గొప్పదన మిది నీ జాతియందు గల మహత్త్వ మిది. నీలో ఉన్న లోటుపాటులను నీవే తెలిసికొని, నీ పూర్వులవలెనే సవరించుకొనుము నీ పూర్వులు చనిన మంచిమార్గం చూచి అభ్యుదయమును పరంపరగా అనుభవించుము" అని హితవుగా, దూరదృష్టితో ఉపదేశించ గల ధీశాలి, ఆచార్యుడు, దక్షుడైన నాయకుడు, ఒకడూ లేకపోయినాడు

ఆంధ్రజాతిని ఉగ్గడించేది ఇది, ఆంధ్రజాతిలక్షణ లక్ష్యములును ప్రతిబింబింపజేసేది ఇది, అని వ్రేలుమడిచి చెప్పదగిన ఆంధ్రవాఙ్మయం ఈ నాడు సృజింపబడలేదు నేటి ఆంధ్రవాఙ్మయంలో వ్రేలుమడచి చెప్పదగిన ఒక కావ్యం గాని, కథ గాని, నాటకం గాని నవల గాని వెల్వడలేదు పూర్వుల సంప్రదాయం అంటే నేటి ఆంధ్రునికి అసహ్యం కలిగించుకోవడం పరిపాటి అయిపోయింది. "మనవాళ్లు పట్టి శెధవాయిలోయి" అని భావంతోనే సంపూర్ణంగా సంతృప్తిచెంది, ఆంధ్రులు స్తోత్రపాఠకులవలె ఆ ?ంగాళీవాడి పంచను, ఈ మహారాష్ట్రుని పంచను వాఙ్మయభుక్తికొఱకు దైన్యముతో దేవులాడుచున్నారు. వీరిదాస్యం చాలక హిందీభాషపంచను చేర బోతున్నారు ఇంతవఱకు చేసిన దానికై సిగ్గుపడక పాశ్చాత్యులు నమిలి ఉమిసిన ఉచ్ఛిష్టవాఙ్మయమును ఆప్యాయముగా ఏరుకుంటున్నారు. ఏమి ఈ నైచ్యభావము అని మందలించడానికి పేరుపెట్టుకొని, బూరుగుచెట్టువలె పెరుగుచున్న ఆంధ్రసాహిత్యపరిషత్తుకు నోరు రాదు ఆంధ్రజాతి దురదృష్టవశముచేత కాబోలు ఆంధ్రునికి పూర్తిగా జాతీయవికాసము కలిగి నిజమైన దేశభక్తి కలగడానికి, ఇంతవఱకు ఏమీ సాధనసంపత్తి కనబడడం లేదు ఆంధ్రవాఙ్మయం అంటే ఏమో తెలియనివారు యీనాడు నూటికి తొంభైతొమ్మండుగురున్నారు దేశచరిత్ర తెలియనివారు కూడా అంతే!

ఆంధ్రదేశం కొన్ని విషయాలలో చాలా ముందు అడుగ వేస్తున్న దని సంతోషించనక్కర లేకుండా, ప్రతిదానిలోను పురోభివృద్ధికి ఆటంకం కలిగించే లోపం ఒకటి కనిపిస్తూనే ఉన్నది ఎంత అందరు ఉన్నా మాత్రం ఏమి ప్రయోజనము, ఆసిగా ?క ఐకమత్యం లేనప్పుడు? ఆ ధర్మదేవత కూడా ఇపుడింతే! నేనన్న నాయకుడు—ఆంధ్రదేశమును ఒక్కమాటమీద ఐక్యభావముతో—ప్రతివిషయములోనూ నడిపింపగల శక్తిగలవాడు లేడు

రాజకీయవ్యవహారములలో ఉండవలసిన కక్షలన్నీ ఆంధ్రదేశంలోనూ బయలుదేరినవి పులినిచూచి నక్క వాతలు పెట్టుకున్నట్టు ఆంధ్రుడు తన కది లాభకర మవునో కాదో, అయితే ఎంతవఱకు దాని లాభం పొందడానికి వీలుంటుందో అన్న యోచన లేకుండా, ప్రతియుద్యమాన్నీ అనుసరించి వాతలతో బయటబడి బాధపడతాడు, అప్పటికైనా స్వాభిమానం, గాయపడి చావసిద్ధమైయున్న కోడిపుంజులాగున తలయెత్తడంచేత తప్పు తెలుసుకొని నడచుకోవడం అలవాటు తప్పిపోయింది. ఆ విషయం అలావుంచినా రాజకీయకక్షలలో ఎవరియందూ కూడా జాతీయాభ్యుదయమునకు, తోడ్పడే లక్ష్యములు కనపడవు. కాంగ్రెసునాయకులూ స్వార్థపరులే! జస్టిసునాయకులూ స్వార్థపరులే ఈ నాడు, కొంచెం పలుకుబడి, అధికారమూ సంపాదించేటప్పటికి ప్రతివానికీ తన సొంతమేలుకోసం, తనవారి ఉపయోగం నిమిత్తం సర్వశక్తులు ధారపోయడం అలవాటు అయిపోయింది. అధికారం కోసం అవినీతివర్తనులై కానిపనులు చేయడం పలుకుబడి సంపాదించినవాని కెల్లా పరిపాటి అయిపోయినది. కంచుకాగడా పెట్టి వెతకితే, నాయకు డనిపించుకుంటూ ఉన్న ప్రతివానికీ తాను నడిపిస్తు, అనుసరిస్తూ ఉన్న ఉద్యమము యొక్క పరిణామము దేశానికి, ఆంధ్రజాతికి ఉపయోగకరమయ్యేనా యన్న దూరదృష్టి యోచన లేదు.

ఈ స్వార్థపరత్వము ముందు పరస్పరద్వేషమునకు, పరస్పరము అసూయలకు, సంశయములకు మూలకందమైనది దీనివలన పూర్వాంధ్రసీమవారిపై పూర్తిగా రాయలసీమవారికి ఈర్ష్యా, ద్వేషములు జనించి తీగెలు సాగుచున్నవి ఈ తీగెలు విషపుష్పములు, పూచి, విషఫలములను కాయక పూర్వము దేశాభిమాని యెవడైనా అవతరించి ఆ విషాంకురములకు తల త్రుంపివేయాలి. కాని అట్టి ప్రయత్నం ఇంకా ఎక్కడా తలయెత్తుట లేదు. ఇపుడు రాను రాను రాయలసీమవారు పెంచుకొని పెద్దచేసుకొనుచున్న కలతలు, వారు ఆంధ్రులై యుండీ వేరుపడిపోతాము అనడం చూచి నపుడు, తలచుకొన్నప్పుడు, ఆంధ్రు డని గర్వపడేవానికీ భీతి, ఆ వేదన కలుగక మానవు.

పరిశీలిస్తే, నిజానికి ఆంధ్రజాతికి క్షత్రియము సమానంగా ఉన్నవి అవి ఆంధ్రదేశము యొక్క నైసర్గిక స్వరూపమునందే కనబడుచున్నవి మన ప్రతిపక్షులు కొందరు, మనలో యోచనలేని కొందరు దురభిప్రాయపడుతూ ఉన్నట్లు ఆంధ్రులు కేవలము ఒడలు తెలియని ఉత్సాహము ప్రకటించే వెర్రివారు మాత్రము కారు. శౌర్యముపట్ల, ఘనమైన శౌర్యము, పట్టుదల, నిర్వహణదక్షత అద్వితీయంగా చూపగలవారు ఆంధ్రులు! శివమెత్తినట్లు ఉత్సాహం కనబఱచేవారయితే ఆంధ్రులు యీ పదిహేనుసంవత్సరాలనుండీ, కాంగ్రెసులోనూ, జస్టిసుపార్టీలోను పేరుప్రతిష్ఠలు సంపాదించి యుండకపోవుదురు.

ఆంధ్రజాతిక ఆత్మవికాసం పూర్తిగా కలగకపోవడంచేతను, ఆంధ్రుల క్షత్రియము సరియైన శిక్షణలో నడిపింపబడకపోవుటచేతను, ఆంధ్రుల ప్రతిభ కట్టతెగిన నీటివలె ప్రవహించి వ్యర్థమైపోవుచున్నది. ఇప్పటి పరిస్థితులు మారిపోవలయును. దేశాభ్యుదయమునకు తోడ్పడవలసిన శక్తిసాధనములు నిష్కారణముగా ఆంధ్రులపట్ల అంతఃకలహములకు నారుపోస్తూ ఉన్న వని మాత్రం సంతాపం కలుగుతున్నది. కాబట్టి యిప్పటి పరిస్థితులు మారవలసియున్నవి.

కృష్ణాగోదావరీతుంగభద్రానదులు మూడును ఆంధ్రమాత నలంకరించు ముత్యాలకంఠమాల లని ప్రతి ఆంధ్రుడు గ్రహించవలెను. మూడును కలిసి ప్రకాశించిననాడే ఆంధ్రసీమ సౌందర్యరాశియై, తేజోమూర్తియై, నిరంతరము ఉత్సాహము గ్రొత్తలు కలిగిస్తూ, ఆనందప్రదాయిని యైయుండగలదు. ఈమూడు మహానదులును ఆంధ్రుల శక్తిత్రయమునకు సాక్షీభూతములు. ఈమూడు మహానదులును ఆంధ్రజాతీయతను స్ఫురింపజేయు చిహ్నములు. ఇందు ఏది సన్నగిల్లినను, లోపించినను ఆంధ్రదేశమునకు మహానష్టము తప్పక వాటిల్లగలదు.

ఆంధ్రుడు ప్రతివాడు తనకు అన్నిటికంటె ఆంధ్ర భూభాగయము, ఎక్కువ క్షేమకరమని భావించుకొనవలయును. అట్టి భాగ్యోదయకాలము ఆసన్నము చేయుటకై ఆంధ్రుడనుకొన్నవాడు ఆంధ్రసీమలో పుట్టినవాడు సర్వదా ఉద్యుక్తుడై యుండి సాధనమార్గములను అన్వేషిస్తూ ఉండవలెను—ఏయుద్యమం తలపెట్టినా యేకార్యం ఆచరించుటకు పూనుకున్నా ఐక్యభావము—మనయందు నాటుకొని పరిల్లేటట్లు మసలుకొంటూ ఉండవలెను. ఆంధ్రదేశంలో ఏమూల ఉన్నప్పటికీ ఆంధ్రుడన్నవాడు భేదభావము లేక దేశగౌరవము తలచుకొన్నప్పుడు పులకితుడు కావలయును అన్న లక్ష్యము మరలకుండా ఉండవలెను. ఇప్పటికి రెండుమూడు శతాబ్దుల యొద్దనుండి దైన్యమునకు పాలౌతూ ఉన్న ఆంధ్రజాతి, మళ్లీ ఎప్పటిగా అభ్యుదయమును, ప్రతిష్ఠను పొందగలుగుటకు తపస్సు ధారపోయవలయును. దానికి ఒకసారి వెనుకకు చూచి పరికించి పర్యాలోచనము చేయవలసి యున్నది. దానికి శిక్షణ కలిగిన దేశాభిమానము అత్యవసరమైన సాధనసంపత్తి అయియున్నది.

# 'చరిత్రచతురానను'లకు సన్మానము

ప్రియసంపాదక మహాశయా,

చరిత్రచతురాననులు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారిని సన్మానము చేయుడంవిషయంలో తమ ప్రబుద్ధాంధ్ర చేస్తూఉన్న కృషి ప్రశంసనీయంగా ఉంది. వీరభద్రరావుగారు ఆంధ్రజాతికి చేసిన మహోపకారాన్ని ప్రబుద్ధాంధ్ర సెప్టెంబరు అక్టోబరు సంచికలలో తామూ ఇతర మహాశయులూ ప్రకటించిన వ్యాసాలూ, లేఖలూ వారు ప్రమోగిస్తూ ఉన్నవి. ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ కవి మొదలైనను వాల్యూములను ప్రకటించి పన్నులూ, దుకాణాలు కలనూ అర్హతగలవారులతో వారిని సత్కరించవలెనని తాము సూచించినారు. తమ సూచన చాలా బాగుంది. కాని ఆ మొత్తము వీరభద్రరావుగారిని ఆంధ్రులుపడిన ఋణంలో కొంచెము భాగానికి కూడా అది చెల్లకాదు.



వీరభద్రరావు గారు చరిత్రపరిశోధకులు సరిగా బయలుపడనికాలంలో ఆంధ్రులచరిత్ర నాలుగు సంపుటాలుగా రచించి ప్రకటించారు. పరిశోధకులు తక్కువయినా ప్రతిభతో విషయాలను ఊహించి ఆంధ్రులచరిత్రకు ఒకవిధంగా రూపాన్ని యిచ్చారు. తరువాత పరిశోధనవల్ల క్రొత్తపరిశోధనలెన్నో లభించినవి. ఆ క్రొత్త పరిశోధనాలమూలాన చరిత్ర తారుమారయిపోయింది. అందువల్ల నేడా సంపుటాలుకూడా దొరకటంలేదు. కాక, వాటిని యథాతథంగా ముద్రించడంవల్లనూ ప్రయోజనంలేదు. అట్లాచేయడం హాస్యాస్పదం కూడ. ఇపుడా ప్రజ్ఞాశాలి నూతనపరిశోధనలను ముందుంచుకొని, ఆంధ్రులచరిత్రను ఆమూలాగ్రంగా సంస్కరించి పునరుద్ధరణం చేయగలిగితే అది ఆంధ్రజాతికి పెన్నిధి లభించినట్లే అవుతుంది. అపనికి అయినే సమర్థుడు. ఆయనకున్నంత పట్టుదలా, ఉత్సాహమూ ఇప్పటి చరిత్రపరిశోధకులలో ఎవ్వరికీ ఉన్నట్టు కనపడదు. ముసలితనం వలన కృశించి శరీరాన్ని అణగద్రొక్కుతూఉన్నా ఉత్సాహమూ, బుద్ధిపాటవమూ నవయౌవనంనాటివలె పొంగుతూ ఆయనను విడనాడకుండా ఉన్నవి. కాబట్టి ఆంధ్రులందరూ అవకాశాన్ని కోలుపోకుండా ఆయనకు కావలసిన సౌకర్యాలను సమకూర్చి ఆయనచేత తమ చరిత్రను ఉద్ధరింపచేసుకోవడం అవసరము. శ్రీయుతులు మల్లంపల్లి సోమశేఖరశర్మ, నేలటూరి వెంకటరమణయ్య ప్రభృతులగు చరిత్రపరిశోధకులు తాము సేకరించిన నూతనచరిత్రసామగ్రిని ఆచరిత్రచతురాననుని సమ్ముఖంలో ఉంచడానికీ, ఇతరులు చరిత్రరచన ప్రకటనలకు పట్టే సొమ్మును సమకూర్చి యివ్వడానికీ ఏర్పాటులయితే ఆంధ్రచరిత్రపునర్నిర్మాణం సులభంగా జరుగుతుంది. అగ్రంథాలవిక్రయం వల్ల వచ్చే సొమ్ము వీరభద్రరావుగారికే ముట్టేనిర్ణయం చేస్తే అది ఉపయోగకరమయిన నిజమయినసత్కారం అవుతుంది. ఇందువల్ల ఆంధ్రులకూ, వీరభద్రరావుగారికీ లాభం కలుగుతుంది కీర్తి నిలుస్తుంది. తాము సెలవిచ్చినమదిరి సత్కారం సత్కారం మాత్రమే అవుతుంది. ఆయనను సత్కరించాము కదా అని ఆంధ్రులు చంకలుకొట్టుకోవచ్చునుకూడా. అంతకంటే గౌరవం అసన్మానాని కుంటుందని భావించడానికి వీలుకనపడదు.

వెనక ౧౯౩౭-వ సంవత్సరం చెన్నపురంలో ఆంధ్రసారస్వత సంఘం వీరభద్రరావుగారిని సన్మానించినపుడు వారిచేత ఆంధ్ర చరిత్ర రచింపించడానికి తీవ్రంగా ప్రయత్నించేసింది. అందుకోసం

'ఆంధ్రచరిత్రప్రచురణసంఘం' అని ఒక సంఘాన్ని ఏర్పాటు చేసింది. దానికి శ్రీ ఉయ్యూరురాజావారు అధ్యక్షులుగను, శ్రీ వేపారామేశం పంతులుగారు ఉపాధ్యక్షులుగను, మరికొందరు ఆంధ్రప్రముఖులు సభ్యులుగాను ఉండిరి. సంస్కరింపబడిన చరిత్ర నాలుగేసివందల పుటల పరిమితిగల పదిసంపుటాలవుతుందని అంచనా వేయబడింది. చెన్నపురంలో ఉండి వీరభద్రరావుగారు చరిత్రరచనాన్ని సాగించడానికయ్యే వ్యయాన్ని శ్రీ ఉయ్యూరురాజావారు భరిస్తామన్నారు. దాన్ని సంపుటం సంపుటంగా ముద్రించి ప్రకటించడంలో విశేషంగా సాయపడతామన్నారు. శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు, వీరభద్రరావుగారదే యెత్తున చెన్నపట్టణంలో నిలిచి చరిత్రరచనం మొదలుపెట్టారు. కాని వారికి వెంటనే ఆరోగ్యం చెడింది: చెన్నపట్టణం విడవవలసివచ్చింది. తర్వాత వారికారోగ్యం మళ్లా ఎప్పుడు చక్కబడిందో కాని ఆ ప్రయత్నం మాత్రం అంతటితో చప్పచల్లారిపోయింది.

ఇటీవల వీరభద్రరావుగారు స్వయంగానే ఆంధ్రచరిత్రరచనానికి పూనుకొన్నట్లును, మొట్టమొదట కాకతీయాంధ్రయుగ చరిత్రను అయిదవసంపుటంగా ప్రకటింపనున్నట్లును పత్రికల్లో ప్రకటించారు. మిక్కిలి వ్యయప్రయాసలవల్ల కాని కడతేరజాలని యీఘనకార్యాన్ని వీరభద్రరావుగారు స్వయంగా చేయతలపెట్టడం వారికి సైజమయిన ధీరప్రకృతికీ, కార్యశూరతకూ అనురూపంగానే ఉండవచ్చుగాక ప్రకృతం దేశకాలస్థితులను, వారి వయస్సును బట్టి చూస్తే సాహసమని చెప్పవలసివస్తుంది. ఇపుడయినా ఆంధ్రులీప్రయత్నం నిరంతరాయంగా కడతేరడానికి సహాయసంపదలను ధారాళంగా సమకూరిస్తే తమకు తమ చరిత్ర లభిస్తుంది. వీరభద్రరావుగారికి వేయి సన్మానాలు చేసినట్లవుతుంది. అదే వీరభద్రరావుగారి కీర్తిగౌరవములకు పరమనిదర్శనమై శాశ్వతంగా ఉండిపోతుంది.

ఒక విధంగా సమగ్రమని చెప్పతగిన ఆంధ్రచరిత్రాన్ని రచించుట కిది పదనయిన అదను. వీరభద్రరావుగారు చరిత్రక్షేత్రంయొక్క గుట్టుమట్టులూ, సారమూ చక్కగా తెలిసిన చిరంతనకర్షకుడు. దోహదానికి మారుమూలల్లో ప్రమగ్గుమండి ఇటీవలి పరిశోధనలవలన వెలికి త్రవ్వి తీయబడిన చరిత్రపరికరాల బలం యథేష్టంగా ఉంది. పోషణానికి పెట్టుబడి పెట్టగలవారు ముందుకు వస్తే ఆంధ్రుల చరిత్ర దివ్యవృక్షమువలె శాఖోపశాఖలతో పుష్టిగా విస్తరిల్లి అమృతఫలశోభితం అవుతుంది. ఈవిషయాన్ని తాము కూడ పర్యాలోచించి ఇందుకు తగినట్లు ప్రబోధప్రయత్నప్రచారాలను సాగింపవలసిందని కోరిక. తాము సూచించిర సత్కారం వద్దనికాదు. దానికంటె ఇది విశిష్టమనీ, లాభకరమనీ మనవి. ఈ పెద్దపనితో కూడా ఆచిన్నపనినీ సాగించవచ్చు.

గన్నవరపు సుబ్బరామయ్య.

---

# వ్యాఖ్యానములు

## నాలిక చివరి మాటలు

" నేను హిందువుగా వుండి చచ్చిపోను "

డాక్టరు అంబేత్కరుగారి ప్రతిజ్ఞ యిది.

బాగానే వుంది.

కాని మనవారిలో అనేకులకు దీని అంతర్యం బోధపడలేదు.

కాంగ్రెస్సువారు కూడా దీనిమీద ఖండనలు కురుపించారు.

వారిలో అనేకులు— మహామహులే యేంచెప్పారంటే!

అస్పృశ్యత నేటిది కాదుట. అది నిమిషాల మీద పొమ్మంటే పోదుట. సవర్ణుల హృదయంలో మార్పు కలిగిందిట. అవర్ణులీవిషయం గ్రహించి కొంచెం వోపిక పట్టాలిట.

అస్పృశ్యులకు మట్టుకేనా యీధర్మం ?

దేశీయులు గ్రహించవలసిం దేమిటంటే ?

కాంగ్రెస్సువారికి తక్షణసంపూర్ణస్వరాజ్యం కావాలి.

అంబేత్కరుగారికి నుంచున్నపాళంగా సంపూర్ణహిందుత్వం కావాలి.

ఎవరో తంత్రాలు పన్నుతున్నారనుకోడం యెందుకూ ?

అస్పృశ్యులు గమారమీ యెనిమిది కోట్లు.

వారు హిందువులా కారా ?

స్వరాజ్యసమస్య యెదట యిది స్వల్పవిషయం అంటే అర్థంలేనిమాట.

హిందువులకూ మహమ్మదీయులకూ ప్రవర్తిల్లుతూ వున్న తగువు సౌకర్యాల కోసం మాత్రమే.

బ్రాహ్మలకూ, బ్రాహ్మణేతరులకూ వున్న పేచీ కూడా అలాంటిదే.

సవర్ణులకూ, అవర్ణులకూ వున్న పోరు—ఇది పునాదిలోనే పుట్టింది.

అస్పృశ్యత పోగొట్టడం కోసం పని చేస్తున్నామనుకుంటున్న వారేమని భావిస్తున్నారో గాని యిది మనకు తల ప్రాణం తోకకు తెచ్చే సమస్య.

క్రిస్టియనులకు సొంతదేశాలనేకాలున్నాయి.

మహమ్మదీయులకూ వున్నాయి.

ఒక్క యీ హిందూదేశంలో తప్ప మనకు కాలికింద మట్టి యేదీ ?

ఇలాంటి స్థితిలో మనలోనే చేరతగ్గవారు, ఎనిమిది కోట్లమంది మతాంతరు లయిపోతే మన గతి యేమయిపోతుందో ఆలోచించారా ?

ఇప్పట్లో మనకు దౌర్జన్యం అపాయకరం అంటారు కాంగ్రెస్సువారు.

ఇది వూతం లేనిమాట.

ఏమంటే ? దౌర్జన్యం మనకు సాధ్యమే కాదు. ఇప్పుడే కాదు, మనకు స్వాతంత్ర్యం వున్న రోజుల్లో కూడా మనం దౌర్జన్యం చెయ్యలేకపోయాము.

కాగా, మనం యుద్ధం చెయ్యవలసివస్తుం దనీ, అందుకోసం మన సంఖ్య హెచ్చుగా వుండా లనీ—ఇలాగ యెవరూ వూహించుకోనక్కరలేదు.

మన కిప్పుడు కావలసినవి కత్తులూ కటారులూ కావు, వోట్లు.

బ్రిటిషుపార్లమెంటువారు హిందూరాజ్యాంగయంత్రం పూర్తిగా మన స్వాధీనం చేస్తా రనుకుందాం. అప్పుడు అస్పృశ్యుల వోట్లు యెనిమిది కోట్లూ మనకు లేకపోతే మన గతి యేం కాను ?

మనుష్యులను, మనం అస్పృశ్యులను చూసినంత హీనంగా మరెవరేనా చూశారా ?

చదువు లేక—"నువ్వూ మనిషివే" అని చెప్పేవారు లేక—"నువ్వు వూళ్లోకి రాకూడ" దంటే కామోసు ననుకుంటూ, పంచముడు, యిప్పటిదాకా, యెవ రేం చేసిన కిక్కురు మనకుండా పూరుకున్నాడు.

కాని యిది ఇనకటికాలం కాదు.

మనదేశంలో, మొన్న మొన్నటిదాకా కాలం, మన చేతిలో కీలుబొమ్మలాగ మసులుకుంది.

బాగా పరకాయించుకోండి.

కాలం యిప్పుడు త్రివిక్రమావతారం తాల్చి వుంది.

ఉన్నతవిద్యా, పరువు ప్రతిష్ఠలూ సంపత్తీ కలిగించే వృత్తీ, కవ్వింపులతోనూ ప్రలోభనాలతోనూ అల్లిబిల్లిగా మెలివేసుకునివుండే మతాంతరులతోడి సావాసమూ, దొరతనంలో పలుకుబడీ, హిందూరాజకీయనాయకుల బుజ్జగింపూ, అన్నిటికీ పైని వివిధజాతులా వివిధదేశాలా పరిస్థితుల పరిజ్ఞానమూ, ఇవన్నీ తలవడంవల్ల పేటెత్తే ఆవేదనా, దానివల్ల వురకలు వేసుకుంటూ పొంగే ఆవేశమూ — ఇన్ని లక్షణాలు గల అంబేత్కరుగారు ఇప్పటిదాకా సైరించుకురాగలగడమే చాలా ఆశ్చర్యకరంగా వుంది.

అంబేత్కరుగారు ఇతరమతం అవలంబిస్తా మనడంతోటే, వారిని, క్రిష్టీనులు ఆహ్వానించారు. మాహమ్మదీయులు పిలిచారు. బౌద్ధులు స్వాగతం చెప్పారు.

మనం.................?

గుజరాతీదేశంలో, కవిఠాగ్రామంలో, సవర్ణులు పెట్టే హింసలు భరించలేక పంచములు గోలపెట్టేటప్పుడు గాంధిగారు, పంచములను ఆవూళ్ళోనుంచి మరో వూరు లేచిపొమ్మన్నారు.

ఇది మొన్న మొన్న నే జరిగింది.

పంచములు, తరతరాలుగా—యుగయుగాలుగా కౌగాచిగా అంటిపెట్టుకుని వున్న జన్మభూమిని విడిచిపెట్టిపోవలసిందేనా ?

ఉపవాసం చేసి పునహోపాక్టు తయారుచేయించిన గాంధిగారు చెప్పవలసిన సలహా యేనా యిది ?

ఇప్పుడు సమన్వయించి చూసుకోండి.

అంబేత్కరుగారు తొందరేపడ్డారా ?

ఇటీవల అస్పృశ్యనాయకులే కొందరు అంబేత్కరుగారి వుద్దేశాన్ని నిరసించినట్టు పత్రికలలో చదివాము.

మేము తెలవక అడుగుతున్నాము.

ఆ అస్పృశ్యనాయకులకు అంబేత్కరుగారి మాటలు బోధపడ్డాయా ?

హృదయం మారిం దని మాటలతో కాదు, చేతలతో చెప్పండి.

ఇవాళ అంబేత్కరుగా రొక్కరే యిలా అన్నారు. మరికొందరు పంచములకు కూడా అలాంటి విసుపు పుట్టకుండా చూడండి.

హిందూదేశంలో యేవూళ్ళోనూ మాలపల్లీ, మాదిగపల్లీ అనే పేటలు వుండకుండా చెయ్యండి.

అంతవరకూ యెవ రేం చెప్పినా నాలిక చివరనుంచి మాట్లాడినట్టే లెక్క.

## బెంబేలు పడిపోవద్దు

పన్నెండు జిల్లాల ప్రదేశం, రమారమీ రెండుకోట్ల జనసంఖ్యా, పూనుకుంటే—కనీసం తలుచుకుంటే కొండలు పిండిగొట్టగలం; కాని నరాలలో బిగి యేదీ? అసలు చైతన్యం మాత్రం యెక్కడిదీ?

"నాతాతలు రాజాంగంగా బతికా" రనే పూర్వస్మృతీ, నే "నాంధ్రుడ" ననే ఆత్మప్రత్యయమూ, "ఇది యిరవయ్యో శతాబ్ది" అనే కాల జ్ఞానమూ యెంతమాత్రమూ లేవు మనకి.

ఇంత లిగాడు స్థితిలో, ప్రపంచకంలో యేమూలా, యేజాతీ లేదు.

ఇలాంటి మనమీద, సాధు వరదరాజంపంతులుగారు, యిప్పటిదాకా యెంతో ఆశపెట్టుకుని వున్నారు.

కాని, నేటికి, వారికి మన పరిస్థితులు చక్కగా బోధపడ్డాయి.

అయితే: మన కద్దరు దిగుమతులూ, మన హిందీకలవరింతలూ, మన జేజేలూ చూసి, వారు, మధ్యమధ్య "సజీవం కాకపోతే జాతి యిలా వుంటుందా?" అని భ్రమపడుతున్నారు.

అంచేతే వారు, కొద్ది రోజుల్లో మనం తమ మహాద్యమానికి సాయపడకపోతే ప్రాయోపవేశం—నిరశనవ్రతం అవలంబిస్తానని ప్రకటించారు.

జాతియొక్క అభ్యుదయంకోసం యిలాగ గండకత్తెర తగిలించుకోడం సామాన్య మైన పని కాదు.

నిజమే. హద్దు లేని ఆవేదనలో కుతకుతలాడిపోతూ వున్న పంతులుగారు ఇలాగ విసిగిపోవడం సహజమే. కాని నిరశనవ్రతం అవలంబించడం మేము ప్రశంసించలేము.

నిరశనవ్రతం స్త్రీలకు కూడా నింద్య మైన పని. ఇది అసమర్థతకూ, అనౌచిత్యానికీ గుర్తు.

కాకపోయినా, ఎక్కణ్ణుంచో గాలివానకు కొట్టుకువచ్చిన హిందీని పట్టుకుని తమ సొంత—మాతృభాషకు ఎసరుపెట్టుకుంటూ వున్న ఆంధ్రులు నిరశన వ్రతాలతో దారికి వస్తారా ?

అరవదేశాన్ని జయించడంలో—ఆక్రమించడంలో పాలించడంలో—తెనుగుముద్రతో ఆదేశానికి ప్రకాశం కలిగించడంలో రక్తం ధారపోసిన యోధుల సంతతివారు వరదరాజం పంతులుగారు.

అలాంటివారి కిలాంటి వూహ తోచడం ఆశ్చర్యకరంగా వుంది.

అరవదేశంలో స్థిరపడిపోయివున్న సుమారు ముప్ఫయిలక్షల ఆంధ్రులకు తెనుగు చదవడమూ రాయడమూ, చివరికి మాట్లాడ్డమూ నేర్పడం అంటే మాటలతో నెరవేరేది కాదు.

ఆపనికి పూనుకోడానికి తగిన చిత్తసంస్కారం తెనుగు జిల్లాలలో వున్నవారి కెవరికీ లేదు. ఎప్పటి కేనా అది వరదరాజం పంతులుగారివల్లనే నెరవేరుతుంది.

విసువుదల వుత్సాహాన్ని దిగపికేస్తుంది. కార్యశూరులు దాన్ని చేరనివ్వకూడదు.

ఇవాళ యిలా వున్నాం కాని నిరాశ వద్దు.

దక్షిణాంధ్రులకు మళ్లీ స్వచ్ఛ మైన తెనుగులో మాట్లాడుకోవాలని ఆశపుట్టింది. సరి అయిన తెనుగు నేర్చుకోవాలనే సంకల్పం కలిగింది.

వరదరాజం పంతులుగారు, ఇవాళ—చిరాస్థాయిగా దక్షిణాంధ్రులను ఉత్తరాంధ్రులతో సరిగా దిద్దాలనే ఖరుగులు ప్రారంభించనక్కరలేదు. దక్షిణాంధ్రుల ఆశా, సంకల్పమూ భ్రూణ్యపక్షాలు అయిపోకుండా ప్రోత్సాహం చేస్తూవుంటే అదే చాలు. ఎప్పటి కేనా దక్షిణాంధ్రులలోనే తమ అభ్యుదయానికి తగిన కార్యదీక్ష కలుగుతుంది.

ఏమంటే ? దక్షిణాంధ్రులకు చుట్టూరా అరవం కమ్ముకుని వుంది. వారికి తమ మాతృభాషమీద సమధిక మైన అభిమానమూ, ఆదరమూ పుట్టడానికి అది మంచి సన్ని వేశం.

వరదరాజం పంతులుగారి ఆవేదనకు మేము మా ప్రశంస లందిస్తున్నాము; కాని నిరశనవ్రతం—ధిక్! బెంబేలు పడిపోవద్దని మేము వరదరాజం పంతులుగారిని ప్రార్థిస్తున్నాము.

మా చెవిలో గింగురు మంటోంది

అంధ్రరాష్ట్రోద్యమాందోళనమా మనకు ప్రధానం స్వరాజ్యాందోళనమా ?

ఇదీ విషయం.

జాతియొక్క పరిస్థితు లన్నీ ఆంధ్రరాష్ట్రోద్యమాందోళనమే ప్రధానం అంటున్నాయి; కాని త్రివేణిపత్రికాసంపాదకులు కోలవెన్ను రామకోటీశ్వరరావు పంతులుగారు మాత్రం స్వరాజ్యాందోళనం ప్రధానం అంటున్నారు.

"స్వరాజ్యము వస్తే ఆంధ్రరాష్ట్రము రానే వస్తుంది"ట. ఈలోపుగా ఆంధ్రరాష్ట్రం వస్తే అది నిర్జీవంగా వుంటుందిట. "ఇప్పటి నిర్జీవము లైన రాష్ట్రాలవంటిదే ఒక ఆంధ్రరాష్ట్రము బిచ్చముపెట్టి, ఇంకా గవర్నరులకు ఐ. సి. ఎస్. ఉద్యోగస్థులకు పని కల్పించి, ఏవో కొన్ని చిల్లర ఉద్యోగాలు, ఒకటిరెండు ప్రాజెక్టులు మనకు ఇచ్చినంతమాత్రాన సంతోషించవలసిన దేనా?" అని అడుగుతున్నారు పంతులుగారు. అయితే: స్వరాజ్యము వస్తే తనంతట అదే వచ్చే ఆంధ్రరాష్ట్రానికి మాత్రం గవర్నరు అక్కరలేదూ ? స్వరాజ్యం వచ్చాక ఐ. సి. ఎస్. పరీక్షలో, అలాంటివో ఇంగ్లాండులో పని లేకుండా ఇండియాలోనే జరుపుకోవచ్చు గాని స్వరాజ్యం చక్కగా నిర్వహించబడాలంటే ఐ. సి. ఎస్‌లవంటి సమర్థులు మనకు అక్కరలేదూ ? ఆంధ్రరాష్ట్రం వస్తే చిల్లరవుద్యోగాలేనా మనకి వస్తాయి. ఇప్పుడవి కూడా మనకి కరువుగానే వున్నాయి కాదూ ? ఒకటి రెండు ప్రాజెక్టు లంటే పంతులుగారి దృష్టికి ఏమీ అనడం లేనట్టుంది. కాని రెండు అక్కరలేదు, తుంగభద్రప్రాజెక్టు వొక్కటి కల్పిస్తే చాలదూ, రాయలసీమ భాగ్యవంత మై ఆంధ్రదేశం సుభిక్షంగా వుండడానికి ?

ఇంతకీ, వుద్యోగాల కోస మేనా మనం ఆంధ్రరాష్ట్రోందోళనం ప్రారంభించి వుండడం ?

పైగా, భాషాప్రాతిక రాష్ట్రనిర్మాణం హిందూదేశాని కిప్పట్లో అపాయకర మైతే మరి కాంగ్రెస్సేందుకు చేసిందీ అపని? కాంగ్రెస్సు అదేశం సులభంగానూ, శీఘ్రంగానూ వ్యాపించి స్వరాజ్యాందోళనం నడపడానికి చిన్న వలయాలు అవసర మయితే, దొరతనంవల్ల కలగవలసిన ప్రయోజనాలు పూర్తిగా సిద్ధించడానికీ, ఒక్కొక్క భాగంవారు ప్రభుత్వంలో తగినంత పలుకుబడి సంపాదించుకోడానికీ కూడా చిన్న వలయాలు అవసరం కావూ ?

గాంధిగారు స్వరాజ్యం సాధించడానికి ఒక్క బార్డోలీతాలూకానే యెందుకు ప్రధానరంగంగా పనిచేశారో పంతులుగారు గ్రహించారా ?

"పోనీ, అంత ఆంధ్రాభిమానమే ఉండి స్వరాజ్యము కంటె ఇదే ముఖ్యమని కొందరికి తోచిన ట్లయితే కాంగ్రెస్సులో లేని మితవాదులు, జస్టిస్సువారు ఇందుకొరకై పాటుపడరే దేమి ?" అంటున్నారు పంతులుగారు. బాగానే వుంది. అయితే ఆంధ్రరాష్ట్రోందోళనం ప్రారంభించినవా రెవరూ ? జస్టిస్సుపక్షం యెప్పుడు పుట్టిందో, ఆంధ్రనాయకులు సుడిగుండంలో పడి ఆంధ్రరాష్ట్రోందోళనం యెప్పుడు మానేశారో పంతులుగారు చెప్ప దేనా కొంచెం

పరిశీలిస్తారా ? మరిన్ని, భాషైకరాష్ట్రసిద్ధాంతం లేవనెత్తినవారు నాగేశ్వరరావుపంతులు వగైరాలే కాని లిబరల్సుకి ప్రాంతీయదృష్టి యెప్పుడూ లేదని వొకరు చెప్పాలా పంతులుగారికి ?

"రౌండుటేబులుకు వెళ్లిన బొబ్బిలిరాజాగారు గాని, సర్ (అప్పుడూనా ?) ఎం. రామచంద్రరావుగారు గాని ఎందుకు వీరుమండి ఆంధ్రరాష్ట్రమును దిగుమతి చేయలేదు ?" పంతులుగారు చాలా నిక్కచ్చిగా వేస్తున్నా రీప్రశ్న. మాకు తెలిసినంతలో రామచంద్రరావుపంతులుగారికి ఆంధ్రోద్యమంమీద యెప్పుడూ అభిమానం లేదు. ఆంధ్రరాష్ట్రం అంటే వారికి అనిష్టమే కాదు వెరుపుకూడానూ. అలా అయితే, వారు కాకినాడ ఆంధ్రసభకు అధ్యక్షత యెందుకు వహించారీ అంటే స్నేహాన్నీ, సాహచర్యాన్నీ, మరికొన్ని ప్రత్యేకకారణాలనూ పురస్కరించుకుని పోలవరం జమీందారుగారు మొదలయినవారు పిలిచారు కనకనూ. అధ్యక్షత విడిచిపెట్ట తగింది కాదు కనకనూనూ. కాకపోయినా, అసలు ప్రతిపాదకులే ప్రస్తావాన్ని విరమించుకున్నప్పుడు అధ్యక్షుడు—దానిమీద యిష్టం లేని అధ్యక్షుడు దాన్ని పట్టుకుని పాకులాడవలసిన అవసరంయేమిటీ?

ఇక బొబ్బిలిరాజాగారి విషయం. ఆంధ్రరాష్ట్రాందోళనం మంచి విజృంభణంలో వున్నప్పుడూ, మనవారు ఆవుద్యమాన్ని విడిచిపెట్టినప్పుడూ రాజాగారు మైనారిటీలోనే వున్నారో, మైనారిటీమెజారిటీలను గురించి యోచించవలసిన పని లేని యింకా చిన్నవయస్సులోనే వున్నారో ? కాకపోయినా, అసలు, ఆంధ్రరాష్ట్రాందోళనం ప్రారంభించిన ఆంధ్రప్రముఖులు స్వరాజ్యం కోసం దాన్ని విడిచిపెట్టా రని సమర్థిస్తూవున్న పంతులుగారు, జస్టిసుపక్షాశయాలకోసం రాజాగారు కూడా ఆంధ్రరాష్ట్రప్రస్తావన వదులుకున్నా రని యెందుకనుకోగూడదూ ?

ఇంతేకే: రామకోటీశ్వరరావుపంతులుగా రిలా అంటున్నారు, గాని కాంగ్రెస్సాంధ్రులకు కూడా ఆంధ్రరాష్ట్రం యిష్టమూ అవసరమూ కూడానూ; గాని గాంధిగారి సర్వాపోశనంలో పడి వారు దొరతనంమీద నాన్‌కో ఆపరేషన్ ప్రయోగించారు కనక వారికి రాష్ట్రం అడగడానికి వీలు లేకపోయింది. అంచేత వారు డబ్బిచ్చి రెడ్డినాయుడుగారిని, మరికొందర్నీ లండను పంపించారు. లండను వెళ్లివచ్చిన రాయభారులకు ఇటీవల విందుచేసి, ఆసభలో నాగేశ్వరరావుపంతులుగారే యిలా చెప్పివున్నారు. ఆమాటలు యిప్పుడేనా పంతులుగారికి జ్ఞాపకం వచ్చాయా ?

ఏతావతా: రామకోటీశ్వరరావుపంతులుగారు, తాము ఎవరి వాదాన్ని విమర్శిస్తూ ఈ వ్యాసం రాశారో యెక్కడా సూచన చెయ్యలేదు. కాకపోయినా, కాంగ్రెస్సువారు, తామే కక్కసిన (మాంటుఫర్డుసంస్కరణాలకు సంబంధించిన) శాసనసభలకే మళ్ళీ యెగబాకుతూ వున్న యిప్పుడు వారి విమర్శ చెయ్యడంలో యేమీ ఔచిత్యం లేదు.

ఈ సందర్భంలో వొక విశేషం మాత్రం స్ఫుటంగా కనపడుతోంది. అదేమిటంటే ?

రామకోటీశ్వరరావుపంతులుగారు, ఇప్పుడు, తమ త్రివేణిపత్రిక కోసం వొక నిధిని సమకూర్చా లని సంకల్పించుకునివున్నారు. దాన్ని తొందరగా—తప్పకుండా పూర్తి చెయ్యవలసిం దని దేశీయులకు విన్నపం చేస్తూ అందులో సంతకం చేసినివారిలో మూడుపాళ్ళు అరవ లున్నారు. ఆంధ్రరాష్ట్రం విడిపోయివుంటే ఆ అరవలు ఆవిన్నపం చేస్తారా ? తెనుగువా రెవ రేనా రాసి పట్టుకవెడితే అందుమీద సంతకం చేస్తారా !

నిజమే. ఈ సంకల్పసిద్ధి కోసమేనా పంతులుగా రిప్పుడు యీ వ్యాసం రాయడం సహజంగానే వుంది.

అయితే "ఏవో కొన్ని చిల్లరఉద్యోగాలూ, ఒకటి రెండు ప్రాజెక్టులూ మనకు యిచ్చినంతమాత్రాన సంతోషించవలసిన దేనా ?" అని అడిగారు పంతులుగారు. ఆ ప్రశ్న యిప్పుడు మా చెవిలో గింగురు మంటోంది.

## సక్కుబాయి టాకీ.

సక్కుబాయి పేరితో తెనుగుటాకీల సంఖ్య పెరిగింది; కాని యోగ్యత బగ్గంపాడయిపోయింది.

నిజంగా; తెనుగుజాతి కీసక్కుబాయిటాకీ వొక పెద్ద మచ్చ.

ఇందులో కవిత్వమూ, సంగీతమూ, అభినయమూ, పాత్రౌచిత్యమూ, శబ్దగ్రహణమూ, ఫోటోగ్రాఫీ, ఆంధ్రప్రతిష్ఠ—సమస్తమూ చెడిపోయాయి.

నటీనటులూ, డైరక్టర్లూ, ఫిలింయజమానులూ యీ విధ్వంసం కాండలో సమంగా పాటుబడ్డారు.

"ఆంధ్రసాక్కుట్టు" చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారి పాటు దీన్లో చాలా యెక్కువ.

మొత్తంమీద, అందరూ డబ్బుకోసం తక్కిన సమస్తమూ విడిచిపెట్టేశారు.

ఇప్పటివరకూ తయా రయివున్న తెనుగుటాకీ లన్నీ చూడగా టాకీలో యేవిధంగా పాలుపుచ్చుకోడానికీ గూడా తెనుగువారు పనికిరా రని తేలుతోంది.

జాతి కంతకూ యిలాంటి అపకీర్తి వస్తూవుంటే రసికు లంతా నిద్రపోతున్నారా ?

డబ్బా, పరదేశాలకు పోతోంది. కళా, కాటికి పోతోంది. ఇక మనకు టాకీ లెందుకూ ?

తెనుగులో చక్కని టాకీలు తయ్యారుచెయ్యడాని కరుహైన డైరక్టర్లే లేకపోతే, యిప్పటి డైరక్టర్లందుకు తగ రని చెప్పడానికేనా దేశంలో విమర్శకులు లేరూ ?

ఇటీవల హిందీప్రచారసప్తాహదినోత్సవంలో దక్షిణభారత హిందీప్రచారసభవారు మాతృభాషాదినం అని వొక ప్రహసనం జరిపారు. అది వారెందుకోసం జరిపారో అది అప్పుడే దేశీయులకు అర్థం అయింది. ఆ వుత్సవపు సభలో భారతిసంపాదకు లయిన శ్రీగన్నవరపు సుబ్బరామయ్యపంతులుగారిని కూడా వొక వక్తగా నిర్ణయించారు. ఈ గౌరవానికి మురిసి పంతులుగారు హిందీప్రచారాన్ని సమర్థిస్తారని హిందీప్రచారసభవారు ఆశించివుంటారు; కాని యిందుకు వ్యతిరేకం జరిగింది సుబ్బరామయ్యపంతులుగారి ఉపన్యాసం లోనుంచి. స్థలం చాలక కొన్నిభాగాలు మాత్రమే ఇక్కడ ప్రకటిస్తున్నాము.

సంపాదకుడు

నాకు పంద్రెండేళ్లుగా భారతి సంబంధం ఉండడంవల్ల తెలుగు వారి రచనలతో పరిచయం బాగావుంది. వాటితత్వం తెలుసుకొనే అవకాశం అందువల్ల ఏర్పడింది. హిందీచదువుకున్న మా తెలుగు వారు హిందీలోనుండి చేసిన అనువాదాలూ, తాము సొంతంగా వ్రాసిన రచనలూ హిందీసంప్రదాయాలను అవలంబించి ఉండడం స్పష్టంగా కనపడుతుంది. కొంతమంది తెలుగుమాటలు మరిచి హిందీమాటలు కలపడంకూడా కద్దు. దీనికి ఎన్నయినా నిదర్శనాలు చూపవచ్చును; చూపగలను. కాని అందు కిది కాదు తరుణము. ఇట్లా తెలుగులో తెలుగుదనం సన్నగిల్లిపోతూ వుండడంటే తెలుగు వారికి విచారం కలగదూ! తెలుగుమాటే ఏల? ఇతరభాషల విషయంకూడా అంతే. మాతృభాషలస్థితి యిదివరకే ఇంగ్లీషు ప్రాబల్యాన క్షీణించిందన్న సంగతి అందరికీ తెలుసు. ఇప్పుడు హిందీవల్ల రాగానపడిపోతూవుంది. అందుకోసమని వారివారి మాతృభాషలను కాపాడుకోమని చెప్పడం అత్యవసరం అవుతుంది. మాతృభాషలో మంచిప్రవేశం సంపాదించుకొని దాని హృదయాన్ని కనుగొన్నవారు ఎందుకోసమయినాసరే. ఎన్ని అన్యభాషలను నేర్చుకొన్నా తమ మాతృభాషవ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోగలరు. ఇది మాతృభాషల విషయం.

ఇంక జాతీయభాష విషయం మనవిచేస్తాను. భారతదేశవాసులందరూ ఏకజాతివారనీ. వారు ఎన్నిమతాలవారయినా ఎన్నిభాషలవారయినా సరే, వారికందరికీ భారతదేశ వ్యవహారాలు సగటున చక్కదిద్దుకోడానికి ఒక సామాన్యభాష అవసరమనీ అట్టిభాషగా ఉండతగింది హిందీ అనీ, అది స్వరాజ్య సంపాదనానికి అవశ్యమయిన ప్రధానసాధనాలలో ఒకటనీ, మనదేశ నాయకులందరూ ఏనాడో నిర్ణయించారు. వారి నిర్ణయాన్నీ, ఆదేశాన్నీ అనుసరించి హిందీ ప్రచారసభ మొలకెత్తి ఆ భాషను వ్యాపింపచేస్తూవుంది. అఖిలభారతజాతి ఉద్ధరణంకోసం ఏర్పరుచుకొన్న ఆ హిందీభాషను, వ్యవహార జ్ఞానంకోసం నేర్చుకోవద్దని తనలోని భారతీయ రక్తం ఇంకిపోనంతవరకూ ఏ భారతీయుడూ చెప్పసాహసింపడని నా విశ్వాసం. ప్రతికూల ప్రచారంవారుకూడా అదే చెబుతున్నారు. అయితే జాతీయభాష స్థానమూ, దానికి చూపవలసిన గౌరవమూ వేరు; మాతృభాషస్థానమూ, దానికి చూపవలసిన గౌరవమూ వేరు. మొదటిది మాతృభాష, తరువాతిది జాతీయభాష. కాని ఇంగ్లీషు చదువువచ్చినతర్వాత అది తల్లకిందులయిపోయింది. గౌరవము ఆ అన్యభాషమీద కలిగిపోయింది. మాతృభాష అగౌరవాన్ని పొందుతూవుంది. ఈముప్పు కడుపుకూటికోసం వచ్చింది. ఇప్పుడిప్పుడు అన్నిభాషలవారూ తమ తప్పును తెలుసుకొంటున్నారు. దిద్దుకోవడానికి ప్రయత్నాలు సాగుతూవున్నవి. ఇంతలో హిందీవచ్చింది. మళ్లీ మాతృభాషకు మరొకపీడకలిగింది. అది తొలగిపోవడముకోసమే ఇప్పుడు హిందీ ప్రచారానికి ప్రతికూలంగా వాదాలు బయలుదేరడం. ఆయాభాషలవారు ఈహిందీ ప్రచారంకోసం వేలకొలదిగా ధనమునిచ్చినారుకాని తమతమ మాతృభాషలకోసమని ఏమీచేశారుకారు. ఎన్నోపరిషత్తులు, సమితులు, సంఘాలు పేరుకున్నవి గాని మాతృభాషోద్ధరణం విషయంలో అవి చేసినపనికూడా పేరుమాత్రంగానే కనపడుతూవుంది. నాపన్నెండేళ్ల అనుభవాన్నిబట్టి చెప్పుతూ ఉన్నాను, ఈకాలంలో ఉత్పత్తి అవుతూవుండే సాహిత్యాన్ని – గ్రంథరూపమయినాసరే, వ్యాసరూపమయినాసరే చూస్తూవుంటే అది నానాటికి భ్రష్టం అవుతూవుండడం స్పష్టంగా నాకు గోచరమవుతూ ఉంది. 'హిందీ–తెలుగు' అనే వ్యాసం వ్రాసిన సంచికలోనే మా తెలుగుస్థితిని గురించి 'భ్రష్టాంధము' అనుపేర ఒకవ్యాసం వ్రాశాను. ఒక తెలుగుకే కాదు. కన్నడానికీ, అరవానికీకూడా పట్టింది యీ గతి. ఆ భాషల పరిచయం కూడా కొంత నాకుండడం మూలాన వాటిల్లో లోపం తెలుసుకోగలిగాను. ఇప్పటికైనా కన్ను తెరచి పరభాషల వ్యామోహాన్ని దూరంగాపెట్టి తమతమ భాషల నుద్ధరించుకోవడం మిక్కిలి అవశ్యకమని ఆయాభాషల వారిని హెచ్చరిస్తూవున్నాను.

హిందీప్రచారకులు కొందరు 'మాతృభాష అక్కరలేదు. హిందీ చదివితే చాలు అనికూడా ప్రచారము చేస్తున్నా' రని ప్రతికూలవాదులు సకారణంగా నిరూపిస్తూవున్నారు. హిందీ ప్రచారకులు అట్లాచేయడం అన్యాయం అనక తప్పదు. ఇంకొక విషయం. హిందీ ప్రచారసభ తాను ప్రచారం చేయడంలో అర్థంవుంది. తన బరువును తగ్గించుకోవడానికని–సభవారు హిందీవ్యాప్తికోసం అనవచ్చును. ఎట్లయినా ఫలం ఒకటే కేండి–ప్రారంభ పాఠశాలలనుండి కళాశాలలవరకు అన్ని తరగతుల పాఠశాలలోనికి హిందీని ఎక్కించవలెనని బాగా ప్రయత్న ప్రచారాలు చేస్తూవుంది. కొన్నింటిలోకి ప్రవేశం కలిగింది కూడా–నియత విషయంగా అవునో కాదో కాని ఐచ్ఛికవిషయంగా మాత్రం అగును. కళాశాలలలోమాత్రం అయితే సహింపవచ్చును గాని ప్రాథమిక మాధ్యమిక ఉన్నత పాఠశాలలలో హిందీ ప్రవేశము దుస్సహం. నేటి పాఠశాలలలో చదువు భారతీయసంప్రదాయానికి విరుద్ధమయింది. అది స్వతంత్రజీవితానికి పనికిరానిది. అట్లాంటి పాఠశాలలలో ఎంతోసొమ్ము వ్యయపెట్టి,

ఎంతో కాలము చదివి ఉన్నతపరీక్షలలో ఉత్తీర్ణులయినవారికి కూడ ఎందులోనూ, ఎందుకుగాని పనికివచ్చేటంత ప్రవేశం లేకపోవడం మనకు అనుభవసిద్ధము. ఈమాత్రానికోసం మనపిల్లలు అనావశ్యకాలు అయిన అనేకవిషయాలను పాఠశాలలో చదవడం అనివార్యమవుతూవుంది. వాటికితోడు హిందీని ఒకదానిని వారికి క్రొత్తగా నెత్తికెక్కించడం అనాలోచితమైనపని. అనావశ్యకాలయిన విషయాలను చదవడంచేత కృశించి కొయ్యబారుతూఉండే పిల్లల మృదువైన మెదడును రాయిపారచేయడం అవుతుందికాని దానికి చైతన్యాన్ని ప్రసాదించి వికసింపజేయడం ఎన్నడూకాదు. ఇట్లా హిందీని చేర్పవలెనన్నకోరిక ఉన్నపుడు అనావశ్యకాలయిన వాటిలో దేనినైనా మాన్పించగలిగినారా? మన కది సాధ్యమా? అస్వతంత్రులకు అది ఎట్లాసాధ్యం అవుతుంది? కాబట్టి యిప్పటి స్థితిలో హిందీని పాఠశాలల్లో ప్రవేశపెట్టడం మిక్కిలి పొరపాటు. ఎన్నియేండ్లు ఎన్నివిధాలుగా ప్రచారప్రయత్నాలు చేసినా ఇతర భాషలవారు ఎన్నడుకూ హిందీభాషవారు కాబోరు. ఎన్నివిధాల పాడయినా తమతమ భాషలనే ఆయాప్రాంతాలవారు వాడుకోక తప్పదు. కాబట్టి హిందీప్రచారం ఒకహద్దుకు అవలనుండియే జరగవలెను. అపుడు దానికి దెబ్బతగలదు. అంతవరకూ ఉపద్రవం తప్పదు దానికి.

నేను తెలుగువాడను; తెలుగునుగురించి మాట్లాడుతూవున్నాను. మా తెలుగువారి కీవిషయంలో కొంత సలహాయివ్వడం అవసరం. ఇప్పుడు హిందీవచ్చినవారన్న ఆరున్నర లక్షమందిలో మా తెలుగువారి సంఖ్య తక్కిన భాషలవారి సంఖ్యకంటె హెచ్చు, ఇందులోనే కాదు, సత్యాగ్రహాల్లో, జైళ్ళకు పోయినవాళ్ళల్లో, ఇతరదేశీయ కార్యాలు చేసినవారిలో ఈ దక్షిణభారతంలో ఇతరప్రాంతాలవారికంటె మా తెలుగువారి సంఖ్యే అధికము. ఎక్కువ కష్టనష్టాలకు పాలయినవారూ వారే. పొంగు ఎక్కువగలవారు మావారు. ముందు వెనుకచూచే స్వభావంలేదు మావారికి. ఏ ప్రాంతం వాడయినా సరే 'దూకండి' అని నిప్పులగుండాన్ని చూపితేచాలు—వాడు ఎట్లాగూ దూకడుకదా, తుదకు దానిదగ్గరకయినా రానక్కరలేదు, మావారు కండ్లుమూసుకొని దూకి కాలిపోతారు. దేశసేవాధురంధరులని అందరూ పొగడుతూ వుంటే వుబ్బిపోతారు. ఏ వెల్లువ దేశాన్ని అలుముకొనివచ్చినా ముందు దానిలోపడి కొట్టుకుపోయే వారు మావారు. ఏశక్తి దేశాన్ని మ్రింగజూచినా మొదటికబళం మావారే. లాభంవుండే కార్యాల్లో మావారికి కడబంతిలో కడపటనైనా స్థానం ఉండడం కష్టం. ఇదంతా అందరికీ బాగా తెలిసిందే. ఇంత అమాయకంగా ప్రవర్తించడం ఎంతో అపాయకరమనీ, పొంగు ఎప్పుడూ పనికిరాదనీ, తాము చేయదలంచిన ప్రతిచిన్నకార్యాన్ని అణువు అణువుగా చక్కగా పరిశీలించి గుణదోషాలను నిర్ణయించి ఆత్మగౌరవప్రతిష్ఠలకు భంగం కలుగకుండా ఆత్మోద్ధరణానికి, అన్యోన్నతికి ఏమాత్రమైనా ఉపకరించేటట్లయితేనే చేయవలసిందని మావారిని కోరుతాను. ముఖ్యంగా ఈ హిందీ నేర్చుకొనేవిషయంలో అగ్రస్థులైనవారు చాల జాగ్రత్తపడి మాతృభాషను బాగా అధ్యయనంచేసి తర్వాత హిందీని వ్యవహారమాత్రజ్ఞానం కలిగేమాత్రంగా—హిందీలో పరీక్షలు అక్కరలేదని నా యభిప్రాయం—చదువవలసిందని హెచ్చరిస్తాను. ఇంతేకాకుండా మాతృభాషాభివృద్ధికోసం సాధ్యమైనంతప్రచారాన్ని చేస్తూ విద్యావిహీనులగు తమ సోదరాంధ్రులు విద్యావంతులై, వారును సర్వకార్యములయందును తమకు చేదోడువాదోడుగ నుండునట్లు చేసికొందురు గాక యని కోరుతాను.

---



---

# వసంతకుసుమాకరము

మధుమేహము, అతిమూత్రము, రాచకురుపులు, శుక్రక్షయము, శుక్రనష్టము, బలహీనత, చిరకాలపు తెల్లకుసుమ, సుఖవ్యాధులు శీర్ణించుటచే కలుగు సకలమూత్రసాళవ్యాధులకు ప్రసిద్ధికెక్కిన ఔషధము. తులము రు 20—0—0.

# సిద్ధమకరధ్వజము

ఇందు బంగారు కలదు. పూచీ యిచ్చెదము.

అగ్రప్రసిద్ధమగు బలవర్ధకౌషధము. రక్తక్షీణము, వీర్యదోషము, నపుంసకత్వము, క్షయ, శ్వాసకాసలు, నరముల బలహీనత, కుసుమ రోగములు, మొదలగువానికి దివ్యౌషధము.

తులము 24—0—0. 60 మాత్రలు రు 10—0—0

# ఏకోత్తరవృద్ధి మహాలక్ష్మీ విలాసరసము

# చ్యవనప్రాశము

క్షయరోగులకు అమృతోపమానములగు దివ్యౌషధములు

చిరకాలము క్షయవ్యాధిచే పీడింపబడుచు శల్యావశిష్టముగ నుండువారలకు నూతనయౌవనమును ఆరోగ్యమును కలిగించును. క్షయ శ్వాసకాసలు ఉబ్బసము కఫముతో కలసి రక్తముపడుట, రక్తహీనత, శరీరకృశత్వము, హృదయదౌర్బల్యము దీర్ఘకాలము నుండి బాధించు మొండిదగ్గులు మొదలగునవి జయించును. బలము, కాంతి శుక్రమును వృద్ధిచేయును.

రెండుఔషధములు కలిపిసేవించవలెను.

నెలకు రు 13—12—0.

# స్వర్ణక్రవ్యాదరసము

చిరకాలాజీర్ణములకు మంచిది. కడుపుబ్బరము, శూల, గుల్మము, యకృత్ ప్లీహ వృద్ధులు మొదలగునవి జయించును. బలవర్ధకము తులం రు 4—0—0.

చిరునామా:—వేంకటేశ్వర ఆయుర్వేదనిలయము

హెడ్డాఫీసు:—చింతలూరు, ఆలమూరుపోష్టు, తూర్పుగోదావరిజిల్లా

---

బ్రాంచిలు:—1. కాకినాడ, 2. రాజమండ్రి, 3. పెద్దాపురం, 4. అనకాపల్లి, 5. విశాఖపట్టణం, 6. ఏలూరు, 7. అమలాపురం, 8. తుని, 9. రామచంద్రపురం.

☞ ఏలూరు బ్రాంచిలో చికిత్సకులు

వైద్యవిద్వాన్ కూచిభొట్ల వెంకటేశ్వర్లుగారు.

# పుట్టుమచ్చలు

పుట్టుమచ్చల గుణతత్వాలు సహేతుకాలుగా చర్చింపబడ్డా యీ పుస్తకంలో. ఈ పుస్తకం చదివి ఇందలి వివిధాంశములను అందరున్నూ గ్రహించుట మంచిది. ఇందులో విశేషాంశము లెన్నియో గలవు.

వెల రు. 1—0—0 మాత్రమే

కొలదిప్రతులే ఉన్నవి. త్వరగా ఆర్డర్లు పంపండి.

# చేయి

ఇదియొక అద్భుత సాముద్రిక గ్రంథము. సాముద్రికమున నమ్మకమున్నవారును లేనివారునుకూడ దీనిని చదివి గ్రహించవలసిన అనేకములయిన అంశము లిందు పొందుపరుపబడినవి. చదివి లాభమందవలసిన గ్రంథము.

గ్రంథకర్త పూడిపెద్ది వెంకటరావు

వెల రు. 1—0—0 మాత్రమే

# హస్తనిర్మాణం

ఇదియొక ఉత్తమమయిన సాముద్రిక గ్రంథము. దీనిలో హస్తనిర్మాణమునగల విశేషములు, వ్రేళ్లు, వ్రేలి కణుపులు, వ్రేలి మడుపులు, గోళ్లు, హస్తమండలములు, వాని అధిష్ఠానగ్రహములును, వానివాని తత్వములును, గుణములు, ఫలితములు మున్నగునవెన్నియో ఇందు విపులముగ చెప్పబడినవి. చదివి చూడండి.

వెల రు. 1—0—0 మాత్రమే

ఈ మూడు పుస్తకములును ఒకేసారి తెప్పించుకొనువారికి తపాలాఛార్జి లేదు.

*For Copies Apply to:—*

**Pudipeddi Venkata Rao,**
Palmist & Occultist
VIZIANAGARAM CITY.
B. N. RY.

ఈ గ్రంథములు రాజమండ్రిలో కలాభివర్ధనీపరిషత్తులోను దొరకును.



# సరస్వతీగ్రంథమండలి

కంభంవారి సత్రమువీధి * రాజమహేం[illegible]

నవలలు—నవరసభరితములగు నవలలు—ముచ్చటగూర్చు బొమ్మలతో—ముద్దు[illegible] క్యాలికో [illegible]డుతో—రెండుమాసముల కొక్క చక్కని నవల. నడుమ నడుమ చిన్న చిన్న అనుబంధగ్ర[illegible]చుందును. చందాదారులకు ప్రవేశరుసుము రు 0-4-0 చందాదారులు ఒకేసారి రు 7-8-0 [illegible]ముందుగా పంపినచో వరుసగా ఆరుపుస్తకములు అన్‌రిజిస్టర్డు పార్శిలుగా పంపుదుము.

## ఇంతవరకు వెలువడిన గ్రంథములు

| | | | | |
|---|---|---|---|---|
| 11 | ప్రేమసుందరి | 1 | 8 | 0 |
| 12 | చోరశిఖామణి | 1 | 8 | 0 |
| 13 | లక్ష్మీప్రసాదము | 1 | 8 | 0 |
| 14 | హత్యారహస్యము | 1 | 8 | 0 |
| 15 | ఫాస్టు (1 భాగము) | 1 | 8 | 0 |
| 16 | ఫాస్టు (2 వ భాగము) | 1 | 8 | 0 |
| 17 | కుముద్వతి | 1 | 8 | 0 |
| 18 | చిన్నకోడలు | 1 | 8 | 0 |
| 19 | రహస్యభేదనము | 1 | 8 | 0 |
| 20 | సింహగడము | 1 | 8 | 0 |
| 21 | మణిహారము | 1 | 8 | 0 |
| 22 | మొగలాయిదర్బారు (1 వ భాగము) | 1 | 8 | 0 |
| 23 | ఘటనాచక్రము | 1 | 8 | 0 |
| 24 | రాజసుందరి | 1 | 8 | 0 |
| 25 | కుంకుమభరణి | 1 | 8 | 0 |
| 26 | జాగిలము | 1 | 8 | 0 |
| 27 | మొగలాయీదర్బారు (2 వ భాగము) | 1 | 8 | 0 |
| 28 | సరస్వతి | 1 | 8 | 0 |
| 29 | ఆనందాభాయి | 1 | 8 | 0 |
| 30 | హత్యాన్వేషణము | 1 | 8 | 0 |
| 31 | మొగలాయిదర్బారు (3 వ భాగము) | 1 | 8 | 0 |
| 32 | XoX | 1 | 8 | 0 |
| 33 | మొగలాయిదర్బారు (4 వ భాగము) | 1 | 8 | 0 |
| 34 | కోహినూరు | 1 | 8 | 0 |
| 35 | ఆటీన్ మజేలా | 1 | 8 | 0 |
| 36 | అపరిచిత | 1 | 8 | 0 |
| 37 | అంతఃపురము 1 భా॥ | 1 | 8 | 0 |
| 38 | అంతఃపురము 2 భా॥ | 1 | 8 | 0 |
| 39 | అగ్రహారము | 1 | 8 | 0 |
| 40 | ఛిన్నహస్తము 1 భా॥ | 1 | 8 | 0 |
| 41 | ఛిన్నహస్తము 2 భా॥ | 1 | 8 | 0 |
| 42 | కంకణరహస్యము | 1 | 8 | 0 |
| 43 | సంజీవి 1 భా॥ | 1 | 8 | 0 |
| 44 | సంజీవి 2 భా॥ | 1 | 8 | 0 |
| 45 | వజ్రరాణి | 1 | 8 | 0 |
| 46 | హత్యాభ్రమ | 1 | 8 | 0 |
| 47 | కాశీఖండము | 1 | 8 | 0 |
| 48 | సేవాశ్రమము 1 భా॥ | 1 | 8 | 0 |
| 49 | సేవాశ్రమము 2 భా॥ | 1 | 8 | 0 |
| 50 | దాసీకన్య | 1 | 8 | 0 |

## అనుబంధములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మృత్యురంగిణి | 0 | 12 | 0 |
| 2 | అభాగిని | 0 | 12 | 0 |
| 3 | ఛద్మవేషి | 0 | 12 | 0 |
| 4 | విదురుని యుపదేశములు | 1 | 0 | 0 |
| 5 | కాంచనమాల | 1 | 0 | 0 |
| 6 | సీమంతిని | 1 | 0 | 0 |
| 7 | సుశీల | 1 | 0 | 0 |
| 8 | శశిరేఖ | 1 | 0 | 0 |
| 9 | యమునాబాయి | 1 | 0 | 0 |
| 10 | శ్యామల | 1 | 0 | 0 |
| 11 | కాంతంకథలు (చిన్నకథలు) | 1 | 0 | 0 |
| 12 | కాలసర్పి | 1 | 0 | 0 |
| 13 | భారతకథాసారం | 1 | 0 | 0 |
| 14 | కథాకల్పవల్లి (చిన్నకథలు) | 1 | 0 | 0 |
| 15 | అరక్షణీయ | 1 | 0 | 0 |
| 16 | మాధవి | 1 | 0 | 0 |
| 17 | లలిత | 1 | 0 | 0 |
| 18 | పెండ్లిదండ | 1 | 0 | 0 |
| 19 | కథావళి | 1 | 0 | 0 |
| 20 | నాలుగుకథలు | 1 | 0 | 0 |
| 21 | నీతిప్రబోధిక | 1 | 0 | 0 |
| 22 | ఆదర్శము 1 భా॥ | 0 | 12 | 0 |
| 23 | ఉదంకుడు | 0 | 12 | 0 |
| 24 | భేతాళకథలు | 0 | 12 | 0 |

## నాటకములు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | మార్కండేయ | 0 | 12 | 0 |
| 2 | అహల్యాశాపవిమోచనము | 0 | 12 | 0 |
| 3 | మేవారుపతనము | 1 | 0 | 0 |
| 4 | వరమాల | 1 | 0 | 0 |
| 5 | షాజహాను | 1 | 0 | 0 |
| 6 | నూర్జహాను | 1 | 0 | 0 |
| 7 | దుర్గాదాసు | 1 | 0 | 0 |
| 8 | చంద్రగుప్త | 1 | 0 | 0 |
| 9 | దంపతులు | 1 | 0 | 0 |
| 10 | విజయవిజయం | 1 | 0 | 0 |
| 11 | భక్తకుచేల | 1 | 0 | 0 |

 ఈ గ్రంథములు రాజమండ్రీలో కళాభివర్ధనీ పరిషత్తులలోను దొరకును.

**చిత్రమూలము** :—చిత్రక - అగ్ని — Plumbago zeylanica. ఎఱ్ఱని చిత్రమూలము— Plumbago R oea.

**స్వరూపము** ఇది రమారమి 2 గజముల యెత్తువరకును పెరుగును. ఇది క్షుపజాతిలోనిది. దీని కాండము సాఫుగా నుండును. ఆకులు చిన్నవిగను పాకులను బోలి యుండును. వానికంటె కొంచెము గుండ్రముగా నుండును. ఆకులు విడివిడిగా నుండును. దీని కుత్తకోణువంటి వెన్నులు బయలుదేరును. పక్కిరికాయలవలె నవి బట్టలకు పట్టుకొనును. వేరు పొడవుగను చిదుగగొట్టిన పసుపురంగుగను యుండును. దీనిలో ఎఱుపు, తెలుపు, పసుపుపచ్చరంగుల భేదముతో మూడు జాతులు కలవు. పూవుల రంగులబట్టియు, కాండముయొక్క స్వల్పమగు రంగును బట్టియు జాతిని నిర్ణయించుకొనవలయును. దీని యితరాంగములకంటె వేరునకే ప్రాశస్త్యము కలదు.

**గుణములు** దీనివేరు మిక్కిలి కారపురుచి గలది. వేడిచేయు స్వభావము గలది. విపాకమునగూడ కారపురుచిగనే యుండును. వాతకఫములను పోగొట్టును. వాతోదరమును, గ్రహణీరోగమును, మూలశంకలను నిర్మూలించును. పాండురోగమును, క్షయయును హరించును. క్రిములను, దురదలను పోగొట్టును. ఎఱ్ఱచిత్రమూలమునకును, నల్లచిత్రమూలమునకును యించుమించుగ నివియే గుణములుకాని కొన్ని విశేషగుణములుకూడ కలవు. ఈ రెండును గూడ రసమును బంధించును. లోహస్వర్ణీకరణమునందుగూడ వాడుదురు. నల్లచిత్రమూలమునకు వెంట్రుకలను నల్లపరుచు గుణముకలదు. పాలలో వేరు వేసిన పాలు నల్లబడునని కూడ చెప్పుదురు. మొత్తమున నీ రెండును అమూల్యద్రవ్యములు.

**ప్రయోగములు** **ఉబ్బులకు** :— చిత్రమూలపు ఆకులు తరిగి కూరగా వండిపెట్టిన ఉబ్బులు తగ్గును. (వంగసేన, శోథ. చి.)

**గ్రహణికి** :—చిత్రమూలము పెద్దములకలయొక్క క్షారమును వారమురోజులు స్రవింపజేసి పిమ్మట దానిని దీసి దానికి రెండురెట్లు ఆవునేతిలో కలిపి వాని ఘృతపాకముగా కాచి సేవించిన జఠరదీప్తిని కలిగించి గ్రహణీరోగమును నివారించును.

**మేదోరోగమునకు** :—చిత్రమూలముయొక్క వేరు చూర్ణము తేనెతో సేవించుచు హితభోజనుడై యున్న మేదోరోగములు హరించును. (వంగసేన, మేదోధికారమున)

**బోదకాలునకు** :—చిత్రమూలపు వేరు ముద్దగాని, దేవదారుగాని లేక రెండును గాని పైన లేపనము జేసిన గుణకారిగా నుండును.

**రసాయనార్థం** :—నలుపు యెఱుపురంగులు గల చిత్రమూలములలో దేనినిగాని వేరుతీసి నీడను యెండించి చూర్ణమును జేసి ఆచూర్ణమును నేతితోగాని లేక నెయ్యి తేనె కలిపిగాని లేక పాలతోగాని అదియును లేనిచో నీళ్లతోగాని యొక మాసమురోజులు సేవించి హితాన్నాశనుడగుచో రోగములు లేకుండ నిస్సంశయముగా నూరు సంవత్సరములు జీవించును. మంచినూనెతో తీసుకొనిన దుస్సహమైన వాతములను గూడ హరించును. గోమూత్రముతో సేవించిన అసాధ్య కుష్ఠరోగములును, బొల్లియు నివారణమగును. మజ్జిగతో త్రాగిన మూలశంఖలు మొదలగు గుదరోగము లన్నియు హరించును. (వాగ్భటము 36. అ. ఉ. స్థానము)

**మూలశంఖలకు** :—చిత్రమూలమును, శొంఠియు కలిపి సీధుమద్యముతో పానము జేసిన మూలశంఖలు హరించును. (చరకము)

**కఫకాసలకు** :—చిత్రమూలపు వేరును, తెల్లబాడిద వేరును ఆకులను మాత్రమే గ్రహించి నీళ్లతో నూరి రసముతీసి పొంగించి దానితో తేనె కలిపి యిచ్చిన దారుణములైన కఫకాసలు శమించును. చిత్రమూలపువేరు వంటికి తాకిన నిప్పువలె పుండగును. చిదుగని వ్రణములను గాని, గ్రంథులనుగాని పుండగుటకై చిత్రమూలమును పైన రాయుదురు. చిత్రమూలము గర్భిణీస్త్రీలకు వాడకూడదు. గర్భస్రావమును గలిగించును. పైన లేపనము చేయుటవలన పక్వముగాని వ్రణములు పక్వమగుటయు, పక్వవ్రణములు చిదుగుటయు గలుగును.

# గంధర్వకళ

## రక్తపుష్టి, వీర్యవృద్ధి, నరములకు బిగి కలిగించు తియ్యని లేహ్యము

అనేకులకు మరల మగతనము కలిగించి మెప్పుపొందినది

గంధర్వకళ—యౌవనము సంఘటించును. శుక్లనష్టము కట్టును. పుంస్త్వము పెంపుచేయును. కామోద్రేకము కలిగించును. సంభోగశక్తి హెచ్చుచేయును. మనోల్లాసము కూర్చును. ఆనందము కలిగించును: ప్రమేహములను జయించును.

కీళ్ళనొప్పులు, దురదలు, తిమ్మిరలు, పోనాడుటలో గంధర్వకళ ప్రత్యేకశక్తికలది. సవామేహములమీద ఇది చేయు పని అసాధారణమైనది. దీనిని ఎప్పుడును సేవించుచుండినచో ముసలితనము కనబడదు. ఏ వ్యాధులును చేరవు. ఇది బాలెంతరాండ్రకును చాల మేలుచేయును, వారి శరీరములకు పూర్వపుబిగి కలిగించును.

పౌను రు ౩—౦—౦

# మలయచందనము

## సెగరోగమునకు పేరుపొందిన ఔషధము

పోటీలలో నెగ్గినది. నకళ్ళను చూచి మోసపోకుడు ?

ఈ క్రూరవ్యాధివలన బాధపడువారికి మా మలయచందనము నాలుగువందల యేండ్లనుండి గురుపరంపరగా వాడబడుచున్నది. ఇది సంస్థానములయందును రాజకుటుంబములయందును వాడుటకు కనిపెట్టబడినది. కావునసే పథ్యము లేదు. పిచికారీతో పనిలేదు. సెగరోగము తగిలినట్లు, మందు పుచ్చుకొనుచున్నట్లు యెవరి తెలియగూడదంటే మా మలయచందన మొక్కటే అందుకు తగినది. నకళ్లు బయలుదేరుచున్నవి. పరిశీలించకుండ ఏ యౌషధమును పుచ్చుకోవద్దు. గంధర్వఫార్మసీవారి మలయచందనమే కావలెనని కోరుడు. అనేక వైద్యులు సొంతమందులను విడిచి దీనిని వాడి విజయము, బహుమతులు పొందుచున్నారు. మూడుపూటలలో గుణమిచ్చును. ఎరుపు, తెలుపు, పచ్చసెగలకు ఇది రామబాణము. రస విష గంధకములు చేరని మూలికాయోగము. ఇక్కడకు అక్కడకు పరుగెత్తక నేడే మాకు వ్రాయుడు.

డబ్బీ ౧-౮-౦ దీని కనుపానము చందనతైలము ఔన్సు ౩-౦-౦ రెంటును ఖర్చులతో ౬-౦-౦

# నాగరఖండము

అజీర్ణములకు శూలలకు, పరిణామశూలలకు చాల మంచిది. ఆకలిలేకపోవుట, కడుపుఉబ్బరము, నొప్పి, నోట నీళ్లూరుట కడుపులో మంట, పొత్తికడుపులో పోటు, కండ్లమంట, ఓకిరింత, వాంతులు, పుల్లత్రేనుపులు, భస్మిక, అరుచి—వీటిని త్వరగా తగ్గించును. విడువకుండ ఒక్కపౌను సేవించినచో ఎట్టి గురుపదార్థమైనను సులభముగా జీర్ణమై, మరల ఆకలి కరకరలాడును. రక్తపుష్టి కలిగించును. పౌను రు ౩-౦-౦.

## గంధర్వఫార్మసీ—ఇన్నిస్ పేట, రాజమండ్రి

